Title

SATAYOGA MANJARI

Auth:

Madhura Krishnamurthy
Sastry

Publi

Jyotisha Vignana Kendramu

Rajamahendravaram

# శతయోగమంజరి

(నూరు రాజయోగముల సంపుటము)

(శ్రీ వెంకటేశ్వర దైవజ్ఞ విరచితము)

ఆంధ్రానువాదకుడు

మధుర కృష్ణమూర్తిశాస్త్రి

ప్రచురణ

జ్యోతిష విజ్ఞాన కేంద్రము

రాజమహేంద్రవరము

ప్రథమ ముద్రణము 1000 ప్రతులు



ప్రాప్తిస్థానము.
జ్యోతిష విజ్ఞాన కేష్ట్రియము
సీతంపేట, రాజమండ్రి-4.

వెల : రు. 15-00

ముద్రణ :
మహేశ్వరి ప్రింటింగ్ & బైండింగ్ వర్క్స్
సీతంపేట - రాజమండ్రి.

# ఉపోద్ఘాతము

శతయోగమంజరి యను నూరు రాజయోగములయొక్క సంపుటిని శ్రీ వెంకటేశ్వర శర్మ యను ప్రాచీన దైవజ్ఞుడు రచించినట్లు గ్రంథారంభమందు 'కథ్యతే వేంకటేశేన' అని, గ్రంథాంతమందు

శ్రీ వేంకటేశ కృపయా వేంకటేశ్వర శర్మణా !
సర్వ స్పష్టమియం విజయతే యోగానాం శతమంజరీ ॥

అను శ్లోకమువలన స్పష్టమగుచున్నది. ఈతని దేశకాలాదులను గురించి తెలియుటలేదు.

ఈ చిన్న పుస్తకమును 1923వ సం॥రములో గోదావరి తీర మందున్న మద్దూరు గ్రామ వాస్తవ్యులు జ్యోతిశ్శాస్త్ర పండితులు అగు శ్రీమాన్ చక్రవర్తుల శ్రీనివాసాచార్యులుగారు తమచే రచి యింపబడి ప్రకటింపబడిన 'శ్రీ జాతకామృతసార'మను జాతక గ్రంథముయొక్క చివరలో ముద్రించిరి. దీనికి తాత్పర్య వివరణ ములు వ్రాయలేదు. 1981వ సం॥రములో శ్రీ చల్లా నాగేశ్వరశర్మ గారు శ్రీ చల్లా లక్ష్మినృసింహశాస్త్రిగారిచే వ్రాయబడిన తెలుగు తాత్పర్యముతో కూడిన శతయోగమంజరిని ప్రకటించిరి. శ్రీ బెంగుళూరు సూర్యనారాయణరావుగారు (బెంగుళూరు) దీనిని ఇంగ్లీషులోనికి అనువదించి ప్రకటించినట్లు వినియుంటిని కాని నేనా గ్రంథమును చూడలేదు. మోతీలాల్ బనారసీదాస్, (ఢిల్లీ) వారు శ్రీ గోపేశకుమార ఓఝాగారి హిందీ అనువాదముతో నీ శతయోగ మంజరిని 'త్రిఫల' అను జాతక గ్రంథములో ప్రకటించిరి. ఈ గ్రంథములో కేవలము 87 యోగముల వరకు మాత్రమే మూలము లభించినట్లు. శతయోగావళియను నామాంతరముగల యీ పుస్తకము లభించినట్లు, శతయోగమంజరి అను గ్రంథము శతయోగావళి అను గ్రంథము రెండును ఒకటియే అనుటకవకాశమున్నట్లు వ్రాసినారు

వారి గ్రంథములో కొన్ని శ్లోకములు, కొన్ని యోగములు లేవు. ఈ గ్రంథము సమగ్రముగ నుండుటచేత దీనిని తెలుగు తాత్పర్య వివరణములతో ప్రకటించితిని. ఇందు ఒక యోగమునకు సంబంధించిన మూల శ్లోకము లభించిలేదు. కొన్ని యోగములు బృహజ్జాతకాది గ్రంథములందు చెప్పబడిన యోగములు గలవు. గ్రంథకర్త బహు గ్రంథములను పరిశీలించి యాయా గ్రంథములందుత్తమయోగములుగ పేర్కొనబడిన వానినన్నింటిని చేర్చి యీ గ్రంథమును రచించెనని తోచుచున్నది.

కొన్ని యోగముల పేర్లలోకూడ నామభేదము చూపబడినది. వీనికి గ్రంథాంతరముల సహాయముతో నా బుద్ధికి తోచినంతవరకు వివరణమును వ్రాసితిని. పండితులీ గ్రంథములోగల గుణ దోషములను బాగుగ విచారించి పరిశీలించి లోపములను తెలిపినచో ద్వితీయ ముద్రణమందు సరిచేసుకొందును. గ్రంథమును సకాలములో ముద్రించి యిచ్చిన శ్రీ మహేశ్వరి ప్రింటింగు ప్రెస్ వారికి నా కృతజ్ఞతలను తెలుపుకొనుచుంటిని.

ఇట్లు
బుధజనవిధేయుడు
మధుర కృష్ణమూర్తి శాస్త్రి

రాజమండ్రి
1-12-1995

# శతయోగమంజరి

## విషయానుక్రమణిక

వివిధ యోగానుక్రమణిక సమాప్తము.

శ్రీరస్తు

శ్రీమహాగణాధిపతయేనమః।

# శతయోగమంజరి

## (జాతకయోగావళి)

### ఆంధ్ర తాత్పర్య వివరణ సహితము

శ్లో॥ శ్రీమన్నారదగర్గాదీన్ ధ్యాత్వా జ్ఞాత్వా చ తన్మతమ్ ।
కథ్యతే వేంకటేశేన శ్రీయోగశతమంజరీ ॥ 1

తా. శ్రీ నారద, గర్గాదిమహర్షులనుధ్యానించి, వారి మతములను బాగుగ తెలుసుకొని వేంకటేశ్వరుడను నేను శతయోగమంజరి యను జాతకయోగములను చెప్పుచుంటిని.

శ్లో॥ జన్మకాలంస్ఫుటీకృత్య ఖేటాన్భావాంశ్చ శాస్త్రతః ।
శ్రీగురూక్త్యనుభూతిభ్యాం జాతకం ఫలమీరయేత్ ॥ 2

తా. జాతకుని జననకాలమును నిర్దుష్టముగనుండునట్లు స్పష్టముచేసి, గ్రహముల స్ఫుటములను, తన్వాదిభావములను శాస్త్రోక్త మార్గముచే చెప్పగ గుణించి, గురూపదేశ శాస్త్రవచనములను, తనయొక్క అనుభవమును ఆధారముచేసుకొని జాతకఫలములను చెప్పవలయును.

వి. జాతక పరిశీలన చేయునప్పుడు జననకాలమును శాస్త్రోక్త మార్గముచే నిర్దుష్టముగ నిర్ణయించి, ఆ కాలమునకు లగ్నాది ద్వాదశభావములను, సూర్యాది గ్రహస్థితులను స్పష్టముగ గుణించి ఫలములను తెలుపవలయుననుటచేత నీ గ్రంథమునందు చెప్పబడిన యోగములను భావస్థిత గ్రహముల నాధారముగ తీసుకొని చెప్పవలయును. ఈ గ్రంథములో చెప్పిన యోగములను భావచక్రమునమసరించి నిర్ణయించవలయును.

## 1. కుసుమ యోగము

శ్లో॥ లగ్నాత్సప్తమగేచంద్రే చంద్రాదష్టమగేరవౌ ।
గురుణాసంయుతే లగ్నే యోగః కుసుమసంజ్ఞితః ॥

తా. జన్మలగ్నమందు గురుడుండగ. లగ్నమునుండి సప్తమమందు చంద్రుడుండి, చంద్రునకు అష్టమభావమందు రవి యున్నచో 'కుసుమయోగము' అనబడును.

వి. "సంయుతే" అనుటచేత లగ్న మధ్యమములో గురుస్థితిని గ్రహించవలయును. తనుభావ మధ్యమములో గురుడుండి, సప్తమభావమధ్యమములో చంద్రుడున్నచో లగ్న సప్తమ భావములందు గురుచంద్రస్థితిచే 'గజకేసరి' యోగముకలుగును. చంద్రునకు అష్టమ భావములో రవి యుండుటచేత పూర్ణ చంద్రుడు సప్తమములో నుండి సంపూర్ణ గురుదృష్టి గలిగి యుండును.

ఈ యోగము లగ్నమందు గురుడు, ద్వితీయ సప్తమభావము లందు రవి చంద్రులుండగసంభవించును. గురుడుదయించి యుండవలెను.

ఫలము

శ్లో॥ కుసుమాఖ్యేతు సంజాతో భూపాలో బంధురక్షకః ।
వింశత్యబ్దాత్పరం గ్రామపురకర్తాభవిష్యతి ॥ 3

తా. కుసుమయోగమందుబుట్టినవాడు రాజు(ప్రభువు)బంధురక్షకుడు 20 సం॥రముల తరువాత గ్రామ పురాదులను నిర్మించువాడు అగును.

## 2. చాపయోగము

శ్లో॥ బంధుకర్మగృహాధీశావన్యోన్యక్షేత్రమాశ్రితౌ ।
ఉచ్చస్థో లగ్నపోయత్ర చాపయోగస్స ఉచ్యతే ॥ 4

తా. చతుర్థ దశమ భావాధిపతులు పరివర్తనమును పొందియుండగ, (అనగా చతుర్థాధిపతి దశమమందు, దశమాధిపతి చతుర్థమం

దున్నప్పుడు) లగ్నాధిపతి ఉచ్చలో నుండెనేని 'చాపయోగ' మనబడును.

ఫలము

శ్లో॥ నృపసంసది విఖ్యాతః కోశాధీశో మహాబలః ।
జాతస్తు కార్ముకే యోగే భూయాదష్టాదశాబ్దతః ॥ 5

తా. చాపయోగమందు జన్మించిన జాతకుడు రాజస్థానమందు గొప్ప పేరుగలవాడు, మరియు కోశాధిపతి, మహాబలసంపన్నుడు అగును. 18 సం॥ములు తరువాత యోగవంతుడగును.

## 3 చక్రయోగము

శ్లో॥ కర్మస్థానగతే రాహౌ కర్మేశే లగ్నసంయుతే ।
లగ్నేశే భాగ్యరాశిస్థే చక్రయోగః ప్రకీర్తితః ॥ 6

తా. దశమభావమందు రాహువు, లగ్నమందు దశమాధిపతి, లగ్నాధిపతి భాగ్యభావమందున్నచో 'చక్రయోగము' అనబడును.

వి. మేషలగ్న జాతకునకు పై యోగము పట్టినను ఫలము స్వల్పము. దశమాధిపతి లగ్నమందు నీచలో నుండుటచే యోగఫలము తగ్గును.

కర్కటకలగ్న జాలకు దశమాధిపతి కుజుడై లగ్నమందు నీచలో నున్నప్పుడు యోగఫలము తగ్గును.

శ్లో॥ బహుగ్రామాధినాథశ్చ సేనానీజనవందితః ।
చక్రయోగేషు విఖ్యాత ఏకవింశతివత్సరే ॥ 7

తా. చక్రయోగజనితులు బహుగ్రామముల కధికారులు, సైన్యాధికారులు, జనులచే కొనియాడబడువారు, విశేషఖ్యాతిగలవారు అగుదురు.

## 4. నాగయోగము

శ్లో॥ కర్మేశస్థాంశరాశీశే కర్మస్థానసమాశ్రితే ।
లగ్నాధిపేనసంయుక్తే నాగయోగ ఇతీరితః ॥ 8

తా. దశమాధిపతియున్న నవాంశాధిపతి లగ్నాధిపతితో కలసి దశమమందున్నచో 'నాగయోగ' మనబడును.

### ఫలము

శ్లో॥ విద్యావినయసంపన్నో నృపపూజ్యోర్థనాధిపః ।
నాగయోగేతు సంజాతః షోడశాబ్దాత్పరంభవేత్ ॥ 9

తా. నాగయోగమందు బుట్టినవాడు విద్యావినయసంపన్నుడు, రాజపూజ్యుడు, ధనవంతుడు అగును. 16 సం॥రములు నిండిన తరువాత యోగప్రాప్తి కలుగును.

## 5. నాభియోగము

శ్లో॥ లగ్నాద్భాగ్యగతేజీవే తల్లాభేతదధీశ్వరే ।
శుభచంద్రేణ సంయుక్తే నాభియోగ ఉదాహృతః ॥ 10

తా. జన్మలగ్నమునుండి భాగ్యభావమందు గురుడుండగ, భాగ్యాధిపతి పూర్ణచంద్రునితో కలసి గురునకు లాభస్థానమందుండెనేని "నాభియోగ" మనబడును.

వి. మేష, కర్కాటక లగ్నములకు భాగ్యాధిపతిగురుడై భాగ్యమందున్నప్పుడు భాగ్యాధిపతి గురునకు లాభములో నుండుట సంభవముకాదు. కనుక యీ రెండు లగ్నములకు నీ యోగము వర్తించదు.

1. వృషభలగ్నమునకు మకరమందు గురుడు భాగ్యభావములో నీచలోనుండగ, భాగ్యాధిపతియగు శని చంద్రునితో కలసి గురునకేకాదశస్థానమందనగా లగ్నమునుండి సప్తమభావమగు వృశ్చికములో నున్నప్పుడీ యోగము పట్టును కాని చంద్రునకు నీచస్థితి యగుటచేత చంద్రునకు శుభత్వము లేకపోవుటచేత యీ యోగము ఫలించదు.

2. కన్యాలగ్నమునకు భాగ్యమందు గురుడు, సప్తమ మందు చంద్ర శుక్రులులున్నప్పుడీ యోగముపట్టును గాని చంద్రుడు క్షీణచంద్రుడగుటచేత యీ యోగము పూర్తిగ పట్టదు.

3. వృశ్చిక లగ్నజాతకులకు భాగ్యభావమగు కర్కాటకమందు

గురుడుండగ చంద్రుడు వృషభములోనుండుటచే నీ యోగము పట్టును. చంద్రుడు క్షీణచంద్రుడు కాకూడదు.

4. ధనుర్లగ్నమునకు భాగ్యభావమగు సింహమందు గురుడుండగ మిథునమందు రవిచంద్రులుండుటచేత నీయోగము పట్టును. చంద్రుడు క్షీణ చంద్రుడగుటచే పూర్ణ ఫలము కలుగదు.

5. మకరలగ్నమునకు భాగ్యభావమందు గురుడుండగ, బుధుడు చంద్రునితోకూడి కర్కటకములో నున్నప్పుడీ యోగము పట్టును. కాని చంద్రుడు క్షీణచంద్రుడగుటచే పూర్ణఫలము సంభవించదు.

6. కుంభలగ్నమునకు భాగ్యభావమగు తులలో గురుడు తనకు లాభభావమగు సింహమందు శుక్రచంద్రులున్నప్పుడీయోగము పట్టును. చంద్రుడు శుభుడు కాకపోవుటచేత ననగా క్షీణుడగుట చేత యీ యోగము పూర్ణ ఫలము నీయజాలదు.

7. మీన లగ్నమునకు గురుడు భాగ్యభావమగు వృశ్చికములో నుండగ, కుజచంద్రులు కన్యలోనున్నప్పుడీ యోగముపట్టును. చంద్రుడు క్షీణచంద్రుడు కాకూడదు.

చంద్రునియొక్క శుభఫలదాతృత్వమును గురించి "జాతకపారిజాతము"లో 2 అ। 10 శ్లోకములో నిట్లున్నది.

శుక్లాదకస్య దశకే ప్రథమేతు మధ్య
వీర్యోద్వితీయ దశకే౽తి శుభప్రదో౽సౌ ।
చంద్రస్తృతీయ దశకే బలవర్జితస్తు
సౌమ్యేక్షణాది సహితో యది శోభనస్స్యాత్ ॥

శుక్లపాడ్యమినుండి దశమ్యంతమువరకు చంద్రుడు మాధ్యమ శుభుడు శుక్లైకాదశినుండి బహుళ పంచమివరకు సంపూర్ణ శుభుడు. బహుళ షష్ఠినుండి అమావాస్యాంతము వరకు బలహీనుడు. అశుభుడు అగును. శుభగ్రహ వీక్షణాదు లున్నచో పూర్ణ శుభుడగును, శుభ ఫలమునిచ్చును.

కాలామృతము 6వ శ్లోకము

అష్టమ్యాశుభయోశ్చ మధ్యమగత శ్శుక్లాన్య యోర్వ్యత్యయే।
పూర్ణః క్షీణఇతిక్రమాచ్ఛశధరః పూర్ణ శ్శుభో మంగళే।
కృష్ణాదా దినపంచకం శుభకరం తన్మధ్యమం మధ్యమం।
తస్యాంత్యం త్వధమాభిదం శశివశాచ్ఛుక్లేషుతద్వ్యత్యయమ్॥

ఈ శ్లోకములో బహుళైకాదశినుండి శుక్లపంచమ్యంతము చంద్రుడధముడని పాపఫలమునిచ్చునని, శుక్ల షష్ఠినుండి శుక్లదశమ్యంతము, బహుళ షష్ఠినుండి బహుళదశమ్యంతము మధ్యమ శుభుడనియు, మధ్యమ శుభఫలము నిచ్చుననియు, శుక్లైకాదశినుండి బహుళ పంచమ్యంతము సంపూర్ణ శుభుడని, సంపూర్ణ శుభఫలము నిచ్చుననియుగలదు. గ్రంథాంతరములందు చంద్రశుభత్వా శుభత్వములను గురించి చెప్పబడిన యంశములనుగూడ పరిశీలించి చంద్రునకు శుభత్వముబాగుగ నున్నప్పుడే యీ యోగము ఫలించునని చెప్పవలయును. గ్రంథకర్త "శుభ చంద్రేణ" అని ప్రయోగించుటచేత చంద్ర శుభత్వమున కెక్కువ ప్రాముఖ్యము నీయవలయును.

ఫలము

శ్లో॥ నాభియోగభవో మర్త్యో విద్యావాన్విత్త వాన్సుఖీ।
రాజపూజ్యోభిజానీస్యా దేకవింశతి వత్సరే॥
నిష్కపంచశత ప్రాప్తిర్వత్సరత్రయతస్తతః॥

తా. నాభియోగమందు జన్మించినవారు విద్య, ధనము, సుఖము, రాజపూజ్యత కలవారగుదురు. 21వ సంవత్సరమునుండి మూడు సం॥రములో 5 వందల నిష్కముల ద్రవ్యము గలవారగుదురు.

అథగ్రహాణాం పరమోచ్ఛ భాగేషు ఫలజ్ఞానాయ కలానియమమాహ॥

గ్రహములు తమతమ పరమోచ్ఛభాగలందున్నప్పుడు వారిచ్చు ఫలములను తెలుసుకొనుటకు గ్రహములకు కలలను చెప్పు చున్నాడు.

శ్లో॥ త్రింశత్కలార్కే మమనేర్విధోస్తు కలా స్వధాషోడశభానుతస్య।
షట్జ్ఞస్య చాష్టాసురపూజితస్య భృగోర్ద్విశ ద్వాదశసూర్య సూనోః।
యష్టేచరణాంపరమోచ్చగానాం ఫలంనిరుక్తం పరిపూర్ణమేవ॥
తుంగాంశకే ప్రోక్తకలాను షేటఃస్థితః ప్రదాస్యత్యను పాతతోన్యత్ ॥

తా. సూర్యునకు 30 కలలు, చంద్రునకు 16 కలలు, కుజునకు 6, బుధునకు 8, గురువకు 10, శుక్రునకు 12, శనికి 1 కలలని గ్రహించవలయును.

సూర్యాదిగ్రహములు తమతమ పరమోచ్చ భాగలందున్న ప్పుడు వారికి చెప్పపడిన కలలతో పూర్ణఫల నిచ్చెదరు. పర మోచ్చ భాగలకు ముందు వెనుకలలో నున్నప్పుడు అనుపాత ముచే గ్రహించవలయును.

## 6. భేరీ యోగము

శ్లో॥ లగ్నేశే పరమోచ్చస్థే ధనరాశి సమన్వితే।
రాజ్యనాథేన సందృష్టే భేరీ యోగమిశంతి తమ్॥

తా. లగ్నాధిపతి ధనరాశియందు పరమోచ్చగతుడై రాజ్యాధిపతిచే చూడబడినచో ॥భేరీయోగ॥ మనబడును.

వి. లగ్నాధిపతి ధనరాశియందు (ధనభావమందు) పరమోచ్చ గతుడగుట మేషాదిద్వాదశలగ్నములందు దేనికి సంభవము కాదు. ధనరాశి శబ్దమునకు ధనస్థానములుగ గుర్తింపబడిన 2, 5, 9, 11 స్థానములలో ఏ స్థానములతో లగ్నాధిపతి పర మోచ్చను పొందుటకు సాధ్యమో ఆ రాశిని ధనరాశియని గుర్తించవలయును.

1. వృషభమునకు శుక్రుడధిపతి. వీనికి పరమోచ్చస్థానము లగ్నా దేకాదశమగు మీనము. దీనియందు శుక్రుడుండి రాజ్యాధిపతి యగు శనిచే చూడబడినప్పుడు,

2. కర్కాటకలగ్నమునకు చంద్రుడధిపతి. వీనికి పరమోచ్ఛ స్థానము లగ్నాదేకాదశమగు వృషభము దీనియందు చంద్రు డుండగ రాజ్యాధిపతియగు కుజునిచే చూడబడినప్పుడు,

3. సింహలగ్నమునకు రవి అధిపతి. వీనికి పరమోచ్ఛస్థానము లగ్నాద్భాగ్యమగు మేషము. దీనియందు రవి యుండగ రాజ్యాధిపతియగు శుక్రునిచే చూడబడినప్పుడని చెప్పదలచి నప్పుడు శుక్రునకు తృతీయదృష్టి నంగీకరించవలసియుండును. ఒకప్పుడు మేషములో దశమభావము వచ్చినప్పుడు దశమాధి పతి కుజుడగును. కుజునిచే చూడబడినప్పుడని చెప్పవలసియుం డును. మేషములో రవి పరమోచ్ఛ భాగంగు 10 భా॥లు దాటిన వెంటనే రాజ్యభావమారంభమై రాజ్యభావ మధ్య మము మేషమందున్నప్పుడు కుజుడు రాజ్యాధిపతి యగుటచే కుజునిచే చూడబడినప్పుడని చెప్పవచ్చును.

4. కుంభలగ్నమునకు అధిపతి శని వీనికి పరమోచ్ఛస్థానము లగ్నాద్భాగ్యమగు తుల. దీనియందు శని పరమోచ్ఛగతుడై దశమాధిపతియగు కుజునిచే చూడబడినప్పుడు,

5. మీనలగ్నమునకు గురుడధిపతి. వీనికి పరమోచ్ఛస్థానము లగ్నాత్పంచమమగు కర్కాటకము. దీనియందు గురుడు పరమోచ్ఛగతుడైనచో దశమాధిపతికూడా గురుడే యగుట చేత దశమాధిపవీక్షణము సంభవించదు.

జాతక పారిజాతమందుగల భేరీ యోగమునకు దీనికి సంబంధము లేదు.

## ఫ ల ము

శ్లో॥ భేరీయోగే వాద్యఘోషైస్సమంతాత్ ।
మత్తేభానాం బృంహితై ర్వాజినాంచ ।
హేషాభిశ్చస్తూయమానస్తు సద్భిః
మట్త్రింశాబ్దా ద్భూపతిర్వేదవన్దేః ॥ 15

తా. భేరీయోగజాతకులు 36 సం॥ముల నుండి 40 సం॥రముల లోపున ప్రభువులగుదురు. గజతురగాది బలసంపన్నులై గొప్ప కీర్తి కలవారగుదురని తాత్పర్యము.

## 7. పద్మయోగము

శ్లో॥ లగ్నాద్భాగ్యాధిపోయస్తు చంద్రాద్భాగ్యాధిపశ్చయః ।
తౌ శుక్రసహితౌ భాగ్యే పద్మయోగ ఇతీరితః ॥

తా. లగ్నాత్తుభాగ్యాధిపతి, చంద్రాత్తు భాగ్యాధిపతియిద్దరు శుక్రునితో కలసి భాగ్యమందున్నచో 'పద్మ యోగ'మగును.

ఫలము

శ్లో॥ వరనృపవందితపాదో భూపాలకపుణ్యకృత్సదాభోగీ ।
శ్రీ పద్మ యోగజాతః పంచదశాబ్దాత్పరంతు పంచాబ్దే॥ 16

తా. శ్రీపద్మయోగమందుబుట్టినవారు శ్రేష్ఠులైన ప్రభువులచే పూజింపబడువారు, ప్రభువులకు కీర్తిని కలిగించువారు, భోగవంతులు అగుదురు. వీరి వయస్సు 15 సం॥రము నుండి 20 సం॥ లోపున యీ యోగఫలము సిద్ధించును.

## 8. వసుమద్యోగము

శ్లో॥ భాగ్యాద్భాగేశ్వరాత్కర్మనాథేతుంగేచధర్మగే ।
కర్మాధిపేన సంయుక్తే వసుమద్యోగ ఈరితః ॥ 17

తా. లగ్నాద్భాగ్యభావమునుండిగాని భాగ్యాధిపతియున్న స్థానమునుండి గాని దశమాధిపతి ఉచ్చయందుగాని, ధర్మ(నవమ) స్థానమందుగాని యుండి లగ్నాద్దశమాధిపతితో కలసినచో 'వసుమ' ద్యోగ మనబడును.

వి. పై శ్లోకమును వేరొకవిధముగ కూడ చెప్పవచ్చును.
భాగ్యాత్కర్మాధిపతి ఉచ్చయందు,భాగ్యాధిపతినుండి కర్మాధిపతి ధర్మస్థానమందుండవలయునని కూడ చెప్పవచ్చును.

వీరిద్దరిలో ఏ గ్రహమైనను లగ్నాత్తు దశమాధిపతితో కలసి నప్పుడు 'వసుమద్యోగము' కలుగును.

1. భాగ్యభావమునుండి దశమాధిపతి ఉచ్ఛయందుగాని, ధర్మ భావములోగాని యుండి లగ్నాద్దశమాధిపతితో కలసినను,

2. భాగ్యేశ్వరునినుండి దశమాధిపతి ఉచ్ఛయందుగాని, ధర్మ భావములో గాని యుండి లగ్నాద్దశమాధిపతితో కలసినను "వసుమ"ద్యోగము పట్టును.

సూ:- ఫలదీపికలోగల వసుమద్యోగమునకు దీనికి సంబంధము లేదు.

ఫలము

శ్లో॥ పరనృప వందితచరణో భూపాలః కర్మకృజ్జనాధ్యక్షః।
వసుమద్యోగే జాతశ్చత్వారింశాత్పరం నవాబ్దేషు॥ 18

తా. వసుమద్యోగ జాతకులు శత్రురాజులచేతకూడ పూజింపబడు వారు, భూపాలకులు, ప్రజలకు సేవచేయువారు, జనసంఘా ధ్యక్షులు అగుదురు. వీరికి 40 సం॥రములనుండి 49 సం॥ర ములలోపున నీయోగఫలములు గలుగును.

## 9. పర్వత యోగము

శ్లో॥ విలగ్ననాథస్థిత రాశినాథః
కేంద్రత్రికోణోపగతో యదిస్యాత్।
మూలత్రికోణేయ దివాస్వగేహే
యోగో మహాన్పర్వత నామధేయః॥ 19

తా॥ లగ్నాధిపతియున్న రాశినాథుడు జన్మలగ్నమునుండి కేంద్ర కోణములందుగాని, తన మూలత్రికోణ, స్వక్షేత్ర రాశులం దుండెనేని "పర్వతయోగ"మనబడును.

ఫలము

శ్లో॥ గ్రామపురాణామీశో లోకేశ్రుత వానరుగ్ణగాత్రశ్చ।
ఖ్యాతః పర్వతయోగే పంచత్రింశాబ్దతఃపరం భూయాత్॥ 20

తా॥ పర్వతయోగమందు పుట్టినవారు గ్రామములకు, పురములకు

అధిపతులు, లోకమందు ప్రతిష్ఠ కలవారు, మంచిఆరోగ్యము కలవారు, ఖ్యాతిగలవారు అగుదురు. వీరి 35 సం॥రముల తరువాత యీ యోగము ఫలించును.

## 10. కాహళీ యోగము

శ్లో॥ విలగ్ననాథ స్థిత రాశినాథ
స్తుంగస్థిత శ్చంద్రమస స్తు కేంద్రే।
బలాధిక శ్చేద్బలవాన్ ప్రదిష్టో
యోగో మహాన్ కాహళికాభిధానః ॥ 21

లగ్నాధిపతియున్న రాశినాధుడుచ్చగతుడై చంద్రునకు కేంద్రములోనున్న చో 'కాహళీ' యోగమనబడును. బలవంతుడై యున్న చో విశేష యోగమని చెప్పవలయును.

ఫలము

శ్లో॥ యోగే కాహళికాఖ్యే విజయీ భాగ్యాన్వితః కామీ।
భోగీ ఖ్యాతో విద్వానష్టా వింశాబ్దతః పరంరాజా ॥ 22

తా. కాహళీయోగమందు పుట్టినవారు విజయము, భాగ్యము గలవారు, కాముకులు, భోగులు, ఖ్యాతిగలవారు, విద్యావంతులు అగుదురు. 28 సం॥రములనుండి ప్రభుయోగముగలవారగును.

## 11. శ్రీయోగము

శ్లో॥ ధనభాగ్యాధిపౌ కేంద్రే స్వస్థానేశసమన్వితౌ।
సురార్చితేన సంధృష్టౌ చేచ్ఛ్రీయోగ స్తువిశ్రుతః ॥ 23

తా. ధనభాగ్యాధిపతులిద్దరు నొక కేంద్రమందుండి ఆ స్థానాధిపతితో కూడియుండి గురునిచే చూడబడినచో '(శ్రీ)యోగ'మనబడును.

ఫలము

శ్లో॥ బుద్ధిప్రధానః పృథివీపతీడ్యః
ప్రత్యర్థి జేతా బహుదేశనాథః।
ద్వావింశతో ర్బ్దా దృతు వత్సరాంత
శ్శ్రీయోగజాతో భవితా మనుష్యః ॥ 24

తా. (శ్రీ)యోగమందుబుట్టిన మనుజుడు తన 22వ సం॥రము నుండి 6 సం॥రములలోపున అనగా 28 సం॥రము లోపున బుద్ధి విశేషముచే ప్రధానుడు, ప్రభువు, ప్రత్యర్థులను జయించువాడు, బహుదేశములందాధిపత్యముగలవాడు అగును

వి. ఈ యోగమందు బుట్టినవారు 22 సం॥రముల తరువాత 6 సం॥రములలో ఉత్తమ స్థితిని పొందగలవారగుదురు. ఈ కాలమందు ప్రభుయోగములను ప్రభుత్వమందు ప్రధానాధికారులుగగాని, ఏదైన పెద్ద సంస్థకు యాజమాన్యము వహించుటగాని సంభవించి ప్రతిష్ఠగలవారుగ నుండగలరని చెప్పదగును.

## 12. మృదంగయోగము

శ్లో॥ లాభేశే పరమోచ్చస్థే భృగుపుత్రేణ సంయుతే ।
తదీశే కేంద్రగే యోగో మృదంగో నామసౌఖ్యదః ॥ 25

తా. లాభాధిపతి పరమోచ్చగతుడై శుక్రునితో కూడియుండగ తదధిపతి (లాభాధిపతియున్న రాశ్యధిపతి) కేంద్రములో నున్నచో "మృదంగ"యోగమనబడును.

1. మేషలగ్నమునకు తులలో శని పరమోచ్చలోనుండగ శుక్రునితో చేరినప్పుడు,
2. వృషభలగ్నమునకు గురుడు కర్కటకములో పరమోచ్చగతుడై శుక్రునితో చేరియుండగ, తదధిపతియగు చంద్రుడు వృశ్చికమును మినహాయించి ఇతర కేంద్రములందున్నప్పుడు
3. మిధునలగ్నమునకు లాభాధిపతి కుజుడు మకరమందు పరమోచ్చలో నుండి శుక్రునితో చేరియుండగ, శని కేంద్రగతుడైనప్పుడీయోగము పట్టును. కాని పంచమలాభాధిపతుల కష్టమ స్థితిదోషము వలన యోగప్రాబల్యముండదు.
4. కర్కటకలగ్నమునకు శుక్రుడు మీనమందు పరమోచ్చగతుడైయుండగ, గురుడు మకరమును మినహాయించి మిగిలిన కేంద్రములందున్నప్పుడు,

5. సింహలగ్నమునకు లాభాధిపతియగు బుధుడు కన్యలో పర మోచ్ఛలోనుండి శుక్రునితో కూడియుండగ తదధిపతి బుధుడు కేంద్రమందుండుట సంభవించదు కనుక ఈ లగ్నమునకు ఈ యోగము పట్టదు.

6. కన్యాలగ్నమునకు లాభాధిపతి చంద్రుడు వృషభమందు పర మోచ్ఛలోనుండి శుక్రునితో కూడియున్నను, తదధిపతి శుక్రునకు కేంద్రస్థితి సంభవింపకపోవుటచే నీ జాతకులకీ యోగము పట్టదు.

7. తులాలగ్నమునకు మేషమందు రవి పరమోచ్ఛగతుడై శుక్రునితో చేరియుండగ తదధిపతి కుజుడు కేంద్రములందున్నప్పుడు, (కుజుడు కర్కటకమందున్నను దోషముకాదు).

8. వృశ్చికమునకీ యోగము పట్టదు.

9. ధనుర్లగ్నమునకు లాభాధిపతి చతుర్థమందు పరమోచ్ఛలో నుండగ గురుడు కేంద్రగతుడైనను లాభాధిపతి శుక్రుడే యగుటచేత ఈ లగ్నమునకు మధ్యమముగ అంగీకరించ వచ్చును.

10. మకరలగ్నమునకు లాభాధిపతికుజుడు మకరమందు పరమోచ్ఛ గతుడై శుక్రునితోచేరియుండగ తదధిపతిశని కేంద్రమందున్నప్పుడీ యోగము పట్టును. తులలో శనియున్న జాతకులకీ యోగ మెక్కువ ఫలించినది లగ్నమందు శని కుజ శుక్రులున్న జాతకులకీ యోగము తక్కువ ఫలము నిచ్చెను.

11. కుంభలగ్నమునకు గురుడు శుక్రునితోచేరి కర్కటమందుండగ చంద్రుడు కేంద్రమందున్నప్పుడు, (చంద్రుడు వృశ్చికములో నుండుట శ్రేష్ఠముకాదు. వృష, సింహ చంద్రుడు క్షీణుడు కాకూడదు.

12. మీనలగ్నమునకు లాభాధిపతి శని తులలో పరమోచ్ఛలో శుక్రునితో చేరినప్పుడు శుక్రునకు అష్టమస్థితి వచ్చును.

ఫ ల ము

శ్లో॥ రాజారాజసమోవా గ్రామపురేశః ప్రబోధయుక్తశ్చ ।
యోగేమృదంగనామనిజాతశ్చత్రాబ్దతఃపరంత్రిభిస్త్రిగుణైః 26

తా. మృదంగయోగమందు జన్మించినవాడు రాజుగాని రాజసమానుడుగాని యగును. గ్రామ, పురాధిపతిగానియగును. ఇతరులకు బోధకుడుగనుండును. 14 సం॥రము నుండి 28 సం॥రము లోపున నీ యోగఫలము ప్రాప్తించును.

## 13 శారదయోగము

శ్లో॥ వర్గోత్తమగతేలగ్ననాథే శుభసమన్వితే ।
లాభాధిపేనసందృష్టే యోగశ్శారదసంజ్ఞితః 27

తా. లగ్నాధిపతి వర్గోత్తమగతుడై శుభులతో చేరియుండగ లాభాధిపతిచే చూడబడినచో 'శారద'యోగమనబడును.

ఫ ల ము

శ్లో॥ సౌఖ్యాన్వితో నరపతిర్బహుభుక్ప్రతాపీ
వీరశ్చయుద్ధనిరతో బహుధర్మకర్తా ॥
శ్రీ శారదోద్భవనరఃఖలు షోడశాబ్దా
దూర్ధ్వం భవేదమరనాయక వత్సరాంతః ॥ 28

తా. శారదయోగమందు పుట్టినవారు సుఖవంతులు, ప్రభువులు, మిక్కిలి భుజించువారు, ప్రతాపవంతులు, వీరులు, యుద్ధప్రియులు, విశేష ధర్మములను చేయువారునగుదురు. వీరి 16 సం॥రము నుండి 14 సం॥రముల లోపున అనగా 30 సం॥రముల లోపున యీ యోగఫలము ననుభవించగలరు.

## 14 సుఖయోగము - ఫలము

శ్లో॥ లాభేశధర్మేశధనేశ్వరాణామేకోఽపి చంద్రాద్యదికేంద్రవర్తీ।
యోగస్సుఖాఖ్యః ఖలుతత్రజాతస్సుఖీ గుణీరాడపిషోడ
శాబ్దాత్ ॥ 29

తా. ధన భాగ్యలాభాధిపతులలో నెవరైననొకరు చంద్రునకు

కేంద్రములో నున్నచో 'సుఖయోగ'మనబడును. ఈ యోగ జాతకులు 16వ సం॥రము నుండి సుఖవంతులు, గుణవంతులు, అధిపతులుగ ప్రసిద్ధులగుదురు.

వి. ఈ యోగము చాల జాతకములపై పరిశీలించినాము. కాని అనుభవములో సరిపడుట లేదు.

## 15 సామ్రాజ్య యోగము - ఫలము

శ్లో॥ ధర్మేశసంయుక్త నవాంశనాథో
జీవేనయుక్తో ధనరాశిసంస్థః ।
కుటుంబభాగ్యాధిపతిర్గురుశ్చేత్ ।
సామ్రాజ్యయోగో నరపాలకస్స్యాత్ ॥ 30

తా. భాగ్యాధిపతియొక్క నవాంశాధిపతి గురునితో కలసి ధనస్థానమందుండెనేని 'సామ్రాజ్యయోగ'మనబడును. గురుడు కుటుంబాధిపతిగాని, భాగ్యాధిపతిగాని కావలయును. ఈ యోగమందు పుట్టినవారు ప్రభువులగుదురు.

వి ఈ యోగమందు గురుడు ధనాధిపతిగాని, భాగ్యాధిపతిగాని యై యుండవలయునని నియమించుటచే మేష, కర్కటక, వృశ్చిక, కుంభలగ్నములకు మాత్రమీయోగము వర్తించును.

## 16 దుర్గేశయోగము – ఫలము

శ్లో॥ రాహుస్థితాంశాధిపతౌ త్రికోణే
స్వోచ్చంగతే భూమిసుతేబలాఢ్యే ।
ధర్మాధిపే సప్తమభావసంస్థే
దుర్గేశయోగో వనభూమినాథః ॥ 31

తా. రాహువుయొక్క నవాంశాధిపతి లగ్నాత్తు త్రికోణరాశియందు చ్చగతుడై యుండగ, కుజుడు బలవంతుడై యుండగ, ధర్మాధిపతి సప్తమభావమందున్నచో 'దుర్గేశ'యోగమగును. ఈ యోగ జాతకులు వనప్రాంత భూములకధిపతులగుదురు.

వి. ఈ శ్లోకమును మరొకవిధముగ చెప్పవచ్చును.

రాహువుయొక్క నవాంశాధిపతి కుజుడై లగ్నమునకు కోణ మందుచ్ఛగతుడై యుండగ, భాగ్యాధిపతి సప్తమభావగతుడై నచో "దుర్గేశ"యోగమని చెప్పదగును. ఈ అర్థమును గ్రహించినచో వృషభలగ్నమునకు, కన్యాలగ్నమునకు మాత్రము కుజునకు కోణమందుచ్చస్థితి సంభవించును. వృషభ లగ్నమునకు ధర్మ(భాగ్య) భావాధిపతి శని సప్తమమందుండి లగ్నమును, కుజుని చూచును. కన్యాలగ్నమునకు రాహు నవాంశాధిపతియగు కుజడు పంచమకోణమందుచ్చలోనుండగ భాగ్యాధిపతియగు శుక్రుడు మీనమందు (సప్తమము) స్థిత కలవాడై లగ్నమును చూచును.

## 17 అర్థయోగము - ఫలము

శ్లో॥ భాగ్యే ధనేశస్సుఖపేనయుక్తోధర్మేశ్వరో విత్తగతో బలాఢ్యః।
లాభేవిలగ్నాధిపతిశ్చతుంగే కోటీశ్వరోరాడపిచార్థయోగే॥ 32

తా. తొమ్మిదవయింటియందు ధనవాహనాధిపతులు, భాగ్యాధిపతి ధనభావమందుండగ, లగ్నాధిపతి ఏకాదశమందుచ్చగతుడై నచో నట్టి జాతకుడు కోటీశ్వరుడు, ప్రభువు అగును.

వి. ఈ యోగము వృషభ, కర్కటక లగ్నములకు బాగుగ వర్తించును. లగ్నాధిపతి ఏకాదశమందుచ్చలోనుండుట సంభవించును కల్పితోదాహరణము :-

1. లగ్నము వృషభము భాగ్యభావమగుమకరమందు ధనవాహనాధిపతులగు రవి బుధులు, భాగ్యాధిపతి శని ధనభావమగు మిధునములోనుండగ లగ్నాధిపతి శుక్రుడు మీనములో నున్నప్పుడు,
2. లగ్నము కర్కటకము భాగ్యభావమగు మీనమందు ధన వాహనాధిపతులగు రవి శుక్రులు, భాగ్యాధిపతియగు గురుడు ధనభావమగు సింహములో నుండగ, లగ్నాధిపతి చంద్రుడు వృషభములోనున్నప్పుడు పై యోగము గలుగును.

## 18 త్రికూటయోగము - ఫలము

శ్లో॥ లగ్నేస్థిరే దానవమంత్రియుక్తే
లగ్నే చరేచేద్గురుణా సమేతే ।
లగ్నేద్విదేహేయదివా ససౌమ్యే
జాతస్త్రికూటే భువిదుర్గనాథః ॥ 33

తా. లగ్నము స్థిరమై లగ్నమందు శుక్రుడున్నను, లగ్నము చరమై అందు గురుడున్నను, లగ్నము ద్విస్వభావమై అందు బుధుడున్నను 'త్రికూట' యోగమనబడును. ఇందు పుట్టినవారు దుర్గాధిపతులగుదురు.

వి. మకరలగ్నమైనపుడు గురునీచస్థితి యోగమునకుబలముండదు.

## 19 చామరయోగము

శ్లో॥ బంధుస్థానాధిపేతుంగే తదీశే ధర్మరాశిగే ।
లగ్నేశే ధర్మరాశిస్థే యోగశ్చామర సంజ్ఞితః 34

తా. లగ్నమునుండి చతుర్థాధిపతి యుచ్చగతుడై యుండగ, ఉచ్చస్థానాధిపతి లగ్నాధిపతికలసి భాగ్యభావమందున్న చో 'చామర' యోగమనబడును.

వి. ఉదాహరణమునకు మేషలగ్నమునకు చతుర్థాధిపతి చంద్రుడు వృషభమందుచ్చలోనుండగ, ఉచ్చాధిపతియగు శుక్రుడు లగ్నాధిపతి కుజునకలసి భాగ్యభావమగు ధనుస్సులో నున్నప్పుడీ యోగము కలుగును.

కొన్ని లగ్నములకు ఈ యోగము పట్టదు.

ఫ ల ము

శ్లో॥ యోగే జాతశ్చామరే రాజపూజ్యో
దేశాధీశస్సర్వమాన్యస్సుశీచ ।
శ్రీమాన్వాగ్మీపండితో గ్రంథకర్తా ।
జాతోభూ గూదుత్తరాయుష్యదారః ॥ 35

తా. చామరయోగజాతకులు రాజపూజ్యతగలవారు, దేశాధిపతులు

సర్వజనులచేత గౌరవింపబడువారు, సుఖవంతులు, శ్రీమంతులు వక్తలు, పండితులు, గ్రంథకర్తలుఅగుదురు. ఉత్తరాయుర్దాయ కాలమందు వీరికీయోగఫలములు గలుగును. ఉదారులుగ నుండగలరు.

జాతక పారిజాతకమందు;

లగ్నేశ్వరే కేంద్రగతే స్వతుంగే జీవేక్షితే చామర
నామయోగః ।

సౌమ్యద్వయేలగ్నగృహే కళత్రే నవాస్పదే వాయది
చామరస్స్యాత్ ॥

అని రెండు విధముల చెప్పబడినది.

జాతకాదేశమార్గమందు వేరొకవిధముగ తెలుపబడెను.

పూర్వపక్షేదివాజన్మలగ్నేశే స్వోచ్చభంగతే ।
ధనకేంద్రగతే జీవేయోగశ్చామర సంజ్ఞకః।అని గలదు.

## 20. శివయోగము - ఫలము

శ్లో॥ పంచమాధిపతౌ భాగ్యే కర్మేశే పంచమస్థితే ।
భాగ్యేశేరాజ్యభావస్థే శివయోగ ఉదాహృతః ॥ 36
ప్రచండవృత్తిర్బహుదేశనాథో
యుద్ధేజయీస్యాచ్చతురంగనేతా ।
జితేంద్రియోజ్ఞానయుతశ్శివాఖ్య
యోగేతు జాతస్సతతంనృపాలః ॥ 37

తా. పంచమాధిపతి భాగ్యమందు, కర్మాధిపతి పంచమమందు, భాగ్యాధిపతి రాజ్యస్థానమందున్న చో 'శివ'యోగమనబడును. ఈ యోగమందు పుట్టినవారు తీవ్రస్వభావము గలవారు, బహుదేశాధిపతులు, యుద్ధమందు జయించువారు, చతురంగ బలమునకధినేతలు, జితేంద్రియులు, జ్ఞానవంతులు, నరపాలకు లగుదురు.

## 21. విష్ణుయోగము - ఫలము

శ్లో॥ భాగ్యనాథాంశపే కర్మనాథే ధనసమన్వితే ।

భాగ్యాధిపేన సంయుక్తే విష్ణుయోగ ఇతీరితః । 38

భోగీస్యాద్బహుదేశభాగ్యవిభవో
లక్షార్థనాథో బలీ । విద్యావాదపటు
శ్వినోదరసికశ్శ్రీవిష్ణుభక్తో మహాన్ ।
అన్యైర్భూపతిభిర్దిగంతరగతైస్సంస్తూయమానస్సదా ।
జీవత్యబ్దశతం నిరామయవపుర్విష్ణ్వాఖ్యయోగే ప్రభుః । 39

తా. భాగ్యాధిపతియొక్క నవాంశాధిపతి, దశమాధిపతి, భాగ్యాధిపతి ధనస్థానమందుండినేని 'విష్ణు' యోగమనబడును.

ఈ యోగజాతకులు భోగులు, బహుదేశ భాగ్యముగలవారు, లక్షల సంఖ్యలో ధనముగలవారు, బలవంతులు, విద్యావాద పటుత్వము గలవారు, వినోదము, రసికత్వముగలవారు, విష్ణు భక్తులు, అనేక ప్రభువులచే కీర్తింపబడువారు, నూరు సంవత్సరములు ఆయుర్దాయముగలవారు, ఆరోగ్యవంతులగుదురు.

## 22. చతుర్ముఖయోగము - ఫలము

శ్లో॥ భాగ్యేశాత్కేంద్రగేజీవేలాభేశాత్కేంద్రగే భృగౌ ।
లగ్నరాజ్యేశయోః కేంద్రే సౌమ్యేయోగశ్చతుర్ముఖః । 40
మృష్టాన్నభోక్తాధరణీసురేడ్యః సత్కర్మకర్తా బహుశా
స్త్రవేత్తా ।
జయీనృపాలో ధరణీప్రదాతా చతుర్ముఖే జీవతి
పూర్ణమాయుః ।

తా. భాగ్యాధిపతికి కేంద్రమందు గురుడు, లాభాధిపతికి కేంద్రమందు శుక్రుడు, లగ్నరాజ్యాధిపతులలో నవరికైన కేంద్రమందు బుధుడు ఉన్నచో 'చతుర్ముఖ' యోగమనబడును.

ఈ యోగమందు పుట్టినవారు మృష్టాన్నభోజనము చేయువారు, వైదిక ధర్మ పరాయణులు, సత్కర్మలనాచరించువారు, అనేక శాస్త్రములను చదివినవారు, జయశీలురు, ప్రభువులు, భూదానములు చేయువారు, పూర్ణాయువుగలవారుఅగుదురు.

## 23. గౌరీయోగము - ఫలము

శ్లో॥ కర్మేశస్థనవాంశేశో లగ్నాత్కర్మణితుంగగః ।
లగ్నాధిపేన సహితో గౌరీయోగ ఉదాహృతః ॥ 41

తా. దశమభావాధిపతియొక్క నవాంశాధిపతి దశమభావమందుచ్చలోనుండి లగ్నాధిపతితో కలసినచో 'గౌరీయోగ'మగును.

శ్లో॥ లోకేదాతా కీర్తిమాన్ భూమినాథో యజ్వా భోగీ
భూసురైః స్తూయమానః ॥
గౌరీయోగేస్యాన్నరః సత్కృతశ్రీ
షట్త్రింశాబ్దాదూర్ధ్వమాద్వ్యాదశాబ్దమ్ । 42

తా. గౌరీయోగమందు పుట్టిన జాతకుడు దాత, కీర్తివంతుడు, భూస్వామి, యజ్ఞాదిక్రతువులను చేయువాడు, భోగి, పండితోత్తములచే కీర్తింపబడువాడు అగును. ఈ శుభఫలములు 36 సం॥రముల నుండి 48 సం॥రముల లోపు గల 12 సం॥రములలోను గలుగును.

వి. మేషలగ్నమునకు దశమాధిపతియగు శని మేషనవాంశములో నుండగ

1. నవాంశాధిపతియగు కుజుడు దశమమగు మకరమందుచ్చలో నుండగ యీ యోగము చెప్పవచ్చును. కుజుడే లగ్నాధిపతి యగుటవలన లగ్నాధిపతితో కలయిక అవసరములేదు.
2. వృషభలగ్నమునకు దశమాధిపతి శనియొక్క అంశాధిపతి యగు శుక్రుడుమీనమందున్నప్పుడు దశమభావాంతములోపున నుండవలయును. ఇక్కడ శుక్రుడు లగ్నాధిపతి యగుటచే ఈ యోగమును చెప్పవచ్చును. శుక్రుడు భావరీత్యా దశమములో నుండును గాని రాశిరీత్యా మీనములోనుండును. గ్రంథకర్త 'తుంగగః' అనుటచేత రాశిచేత మీనమును గ్రహించవలసియున్నది.
3. మిథునలగ్నమునకు దశమాధిపతియగు గురునియొక్క నవాం

శాధిపతి శుక్రుడై మీనములో దశమభావములో నుండగ, లగ్నాధిపతి బుధుడు శుక్రునితో కలసి మీనమందుండుటచేత నీ యోగము పూర్ణముగ పట్టును.

1. వాహన పంచమాధిపతులగు బుధ శుక్రుల సంబంధము, నీచోచ్చగ్రహసంబంధమువలన నీచభంగ రాజయోగముగూడ యిందులో కలిసియుండును.

4. కర్కాటకలగ్న జాతకులకు దశమాధిపతియగు కుజుని నవాంశాధిపతి రవియై మేషమందు దశమభావములోనుండి, లగ్నాధిపతి యగు చంద్రునితో కలియుటచే నీ యోగము కలుగును. కర్కాటక లగ్నజులకు మేషములో దశమభావమందు రవి చంద్రులుండగ దశమాధిపతియగు కుజుడు సింహాంశమును పొందియుండవలయునని తాత్పర్యము.

5. సింహలగ్నమునకు దశమాధిపతియగు శుక్రుడు కర్కాటక నవాంశములోనుండగ చంద్రుడు రవి (లగ్నాధిపతి)తో కలసి వృషభమందు మొదటి 8 భాగలలోపున యుండవలయును.

6. కన్యాలగ్నమునకీయోగము వర్తించదు.

7. తులాలగ్నమునకు దశమాధిపతియగు చంద్రుని నవాంశాధిపతి గురుడై కర్కాటకమందు శుక్రునితో నుండవలయును.

8. వృశ్చికలగ్నమునకీయోగము వర్తించదు.

9 ధనుర్లగ్నమునకు దశమమగుకన్యలో బుధ, గురువులుండగ, బుధుడు, బుధనవాంశలందెందైన నుండవలెను.

10. మకరలగ్నమునకు దశమమందు శనియుండగ శుక్రుడు కన్యాంశమును పొందవలయును. లగ్నాధిపతి శని యగుట గుర్తించవలెను,

11. కుంభ మీన లగ్నములకీయోగము వర్తించదు.

## 24. లక్ష్మీయోగము – ఫలము

శ్లో॥ భాగ్యేశస్థనవాంశేశో భాగ్యేతూచ్చంగతో యది ।
పుత్రాధిపేన సంయుక్తో లక్ష్మీయోగ ఉదాహృతః ॥ 48

రాజాభ వేమ్భూపతివంశజాతో
దిగంతవిశ్రాంతయశాః పరంతతః ।
లక్ష్మ్యాఖ్యయోగే ధనవాంశ్చిరాయు
ర్జాతస్సుఖీ మానయుతశ్చజీవేత్ ॥ 44

తా. భాగ్యాధిపతియొక్క నవాంశాధిపతి భాగ్యభావమందుచ్చ గతుడై పంచమాధిపతితో కలసినచో 'లక్ష్మీ యోగ'మనబడును ఈ యోగ జాతకులు రాజవంశజనితులైనచో ప్రభువులగుదురు విశేష కీర్తికలవారు. ధనవంతులు, దీర్ఘాయుష్మంతులు, సుఖము గౌరవము గలవారగుదురు.

వి. వృషభలగ్నమునకు భాగ్యాధిపతియగు శని కుజనవాంశమును పొందియుండగ, కుజుడు మకరమందు పంచమాధిపతియగు బుధునితో కలసినప్పుడీయోగము పట్టును. ఇట్లు కర్కాట, సింహ, కన్య, వృశ్చిక, మకర, కుంభలగ్నములకు కూడ విచారించవలయును.

## 25. భారతీయోగము - ఫలము

శ్లో॥ వాగ్బుద్ధి లాభస్థానేశ నవాంశపతిభిస్త్రిభిః ।
సోచ్చస్థై ర్భాగ్యపయుతై ర్భారతీయోగఉచ్యతే॥ 45
త్రివిధేపిచ తద్యోగే సంపత్సారస్వతోదయః ॥
కీర్త్యాక్రాంతజగత్త్రయోవిజయతే సర్వజ్ఞచూడామణి
స్సంగీతప్రియఉత్తమస్సురతికృన్నారీషుఃహ్యావ్యపి ॥
మృద్వంగోవిమలాబ్జనేత్రియుగళో భూదేవభక్తః కవి
ర్లభ్యాశీవసు వేదవత్సరత ఊర్ధ్వం భారతీయోగజః ॥ 46

తా ద్వితీయ, పంచమ, లాభాధిపతుల నవాంశాధిపతులుముగ్గురులో నెవరైనను తమ ఉచ్చరాశిగతులై భాగ్యాధిపతితో కూడిరేని సారస్వత (భారతీ) యోగమనబడును.

ఈ త్రివిధమైన యోగమందు బుట్టిన జాతకుడు కీర్తివంతుడు, సర్వశాస్త్రములు తెలిసినవాడు, సంగీతప్రియుడు, ఉత్తముడు,

బహుస్త్రీలతో భోగమనుభవించువాడు, కోమలశరీరాంగములు కలవాడు, బ్రాహ్మణ భక్తుడు, కవి, అల్పభోక్త అగును. ఈ యోగఫలములు 48 సం॥రము తరువాత యనుభవములోనికి వచ్చును.

## 26. కలానిధియోగము – ఫలము

తృతీయలాభాధిపతౌచ కామేమదేశ్వరే
రిఃఫగతేచ తుంగే ।
వ్యయేశ్వరే జీవయుతేచభాగ్యే
కలానిధిర్యోగ ఇతి ప్రశస్తః ॥ 47

తా. తృతీయ లాభాధిపతులలో నెవరైనను సప్తమమందుండి, సప్తమాధిపతి వ్యయమందుచ్చగతుడై యుండగ, వ్యయాధిపతి గురునితో కలసి భాగ్యభావమందున్నచో "కలానిధి" యోగ మనబడును.

వి. ఈ యోగముయొక్క సంపూర్ణ లక్షణములు వాస్తవమునకు సరిపడునట్లు తోచుటలేదు. ఎందువలననగా :-

మదేశః రిఃపగతేచతుంగే॥ అనుదానిని విచారించగ లగ్నాత్సప్తమాధిపతి వ్యయభావమందుచ్చలోనుండుట మేష లగ్నమునకు మాత్రమె సాధ్యముగనుండును. మిగిలిన లగ్నములకు సాధ్యముకాజాలదు.

1. మేషమునకు సప్తమాధిపతి శుక్రునకు మీన ముచ్చరాశి ద్వాదశమగును.
2. వృషభతులలకు సప్తమాధిపతి కుజుడు వీనికి పై లగ్నముల వ్యయభావము ఉచ్చస్థానముకాదు.
3. మిధునకన్యలకు సప్తమాధిపతి గురుడు వీనికి పై లగ్నముల వ్యయభావము ఉచ్చస్థానముకాదు.
4. కర్కాటకసింహములకు సప్తమాధిపతిశని. వీనికి పైలగ్నముల వ్యయభావము ఉచ్చరాశికాదు.

5. వృశ్చికమునకు సప్తమాధిపతి శుక్రుడు వీనికి పై లగ్నమునకు వ్యయభావముచ్చక్షేత్రముకాదు.
6. ధనుర్మీనములకు సప్తమాధిపతి బుధుడు. వీనికి పై లగ్నముల వ్యయభావము ఉచ్చరాశికాదు.
7. మకరకుంభములకు సప్తమాధిపతులు చంద్రరవులు వీరికి పై లగ్నముల వ్యయభావము ఉచ్చక్షేత్రముకాదు.

ఇదియేకాక మిగిలిన కారణములుగూడ యథాతథముగ సరిపడు అవకాశములు లేవు.

ఈ శ్లోకములో ఏద్దైన పొరపాటు పడనదేమోయని భావించ వలసి యున్నది. పండితులీ విషయమును గమనించగలరు. మరొక సమన్వయమును గూడ ఆలోచించవలసియున్నది.

యోగే కలానిధౌ జాతో మర్త్యోభూయాన్మహామనాః ।
రాజామానీయశస్వీచజీవేత్పంచా శతఃపరమ్ ॥ 48

కలానిధియోగమందు పుట్టినవారు గొప్ప మనస్సుగలవారు అగుదురు. 50 సం॥రముల పైన జీవించెదరు.

## 27. దేవేంద్రయోగము - ఫలము

శ్లో॥ లగ్నాధిపేలాభగతేధనేశే
కర్మస్థితే రాజ్యపతౌ ధనస్థే ।
లాభేశ్వరే లగ్నగతే బలాఢ్యే
దేవేంద్రయోగఃస్థిరభేచలగ్నే ॥ 49
స సుందరస్స్యాత్కులసుందరీణాం
ప్రియస్సుకీర్తిర్బహుదుర్గపాలః ।
సేనాధిపశ్శౌర్యయుతో బలీచ ।
స్యాద్దానవష్టాబ్దవయాస్తథైంద్రే ॥ 50

తా, లగ్నము స్థిరరాశియై లగ్నాధిపతి లాభభావమందు, ధనాధిపతి రాజ్యస్థానమందు, రాజ్యాధిపతి ధనస్థానమందుండగ, లాభాధిపతి లగ్నగతుడై బలవంతుడైనచో "దేవేంద్రయోగము" కలుగును.

ఈ యోగమందు పుట్టినవాడు సుందరుడు, స్త్రీలకు ప్రియుడు, కీర్తివంతుడు అనేక దుర్గములను పాలించువాడు, సేనాధీశుడు, శౌర్యవంతుడు, బలవంతుడు అగుచు 60 సం॥రముల లోపు జీవించువాడగును.

వి. ఈ యోగము లగ్న లాభాధిపతులయొక్క, ధనరాజ్యాధిపతుల యొక్క పరివర్తనము వలన కలుగుచున్నది.

ఈ యోగము మేష, సింహ, కన్య, మకర, కుంభ, మీన లగ్నములకు సంభవించదు. కర్కాటకలగ్నమునకు లగ్నాధిపతి చంద్రుడు వృషభములోను, ధనాధిపతి రవి రాజ్యములోను, రాజ్యాధిపతి కుజుడు సింహమందుండగ, లాభాధిపతి శుక్రుడు లగ్నమగు కర్కాటకములో రవికి 4వ యింటిలో నుండుట కొన్ని ప్రదేశములందు సంభవము కాగలదు.

## 28 మదనయోగము - ఫలము

శ్లో॥ రాజ్యనాథే విలగ్నస్థే భార్గవేణ సమన్వితే ।
లాభేలాభేశ్వరే తుంగే యోగో మదన సంజ్ఞకః । 51

మదనయోగమనోహరలక్షణో
మనుజనాయక మంత్రివిచక్షణః
పరవధూజనమోహకరః పరం
కరతపతి సుఖంఖలు వింశతేః । 52

తా. రాజ్యాధిపతి శుక్రునితో కలిసి లగ్నమందుండగ, లాభాధిపతి లాభభావమందు లేక ఉచ్చలోనున్నచో "మదనయోగ"మగును మదనయోగజాతకులు మనోహర రూపలక్షణములు గలవారు ప్రభువులకు మంత్రులు, పరస్త్రీలను సహితము మోహపరచు రూపము గలవారు అగుదురు వీరు 20 సం॥రముల తరువాత సుఖము ననుభవించగలరు.

వి. ఈ యోగమును గురించి విచారించినప్పుడు అన్ని లగ్నము కు
నీ యోగము సంభవించదు.

1. మేషలగ్నమునకు రాజ్యాధిపతి శని లగ్నమందు శుక్రునితో కలసి యుండగ, లాభాధిపతి (శని) లాభమందు గాని ఉచ్ఛ యందుగాని స్థితినొందుట సంభవము కాదు.

ఈ విధముగ యితరలగ్నముల విషయములోగూడ యోచించ వలయును.

## 29. మాలా యోగము - ఫలము

శ్లో॥ ధనేశేధనరాశిస్థే భాగ్యేశేభాగ్య సంయుతే ।
లాభేశేలాభసంయుక్తే మాలాయోగ ఇతీరితః॥ 53
రాజమంత్రీ ధనాఢ్యశ్చ సేనాధీశో మహాయశాః।
మాలాయోగేతు సంజాతస్త్రయస్త్రింశాబ్దతస్సుఖీ॥ 54

తా. ధనాధిపతి ధనభావమందు, భాగ్యాధిపతి భాగ్యభావమందు, లాభాధిపతి లాభభావమందు స్థితిగలవారైనచో 'మాలాయోగ' మనబడును.

ఈ యోగమందు బుట్టినవారు మంత్రులు, ధనాఢ్యులు, సైన్యాధిపతులు, కీర్తివంతులు అగుదురు. 33 సం॥రము నుండి సుఖము ననుభవింతురు.

## 30. విభావసు యోగము - ఫలము

శ్లో॥ కర్మస్థితే భూమిసుతే స్వభేవా
దినేశ్వరే స్వోచ్ఛగతే ధనస్థే ।
సురార్చితే భాగ్యయుతే సచంద్రే
విభావసుర్నామ స యోగరాజః॥ 55
విభావసౌ యః పురుషః ప్రజాత
స్స వంశనాథో బహువిత్తదారః॥

రాజప్రియో భూమిపతిశ్చ జీవేత్ ।
ద్విసప్తతిం సౌఖ్యయుతస్తథాఢ్యాన్॥ 56

తా. కుజుడు దశమభావమందు స్వక్షేత్రమందుండగ గాని, రవి ధన స్థానమందుచ్చగతుడై యుండగ గాని గురుచంద్రులు భాగ్యములో నున్నచో "విభావసు" యోగమనబడును. ఈ యోగ జనితులు వంశమునకు పేరుప్రతిష్ఠలు తెచ్చువారు, విశేష ధనముకలిగి బహుభార్యలుగలవారు, రాజప్రియులు, ప్రభువులుగనుదురు. 72 సం॥ములు సుఖముగ జీవింతురు.

వి. 1. కర్కాటక లగ్నమునకు దశమమగు మేషమందు కుజుడుండగ, మీనమందు (భాగ్యమందు) గురు చంద్రులున్నప్పుడు,

2. కుంభలగ్నమునకు కుజుడు దశమమందుండగ భాగ్యమందు (తులలో) గురుచంద్రులున్నప్పుడు.

3. మీనలగ్నమునకు ద్వితీయమందు రవి ఉచ్చలోనుండగ, భాగ్యమందు చంద్రగురువులున్నప్పుడు ఈ యోగముపట్టును.

## 31. నాళయోగము - ఫలము

శ్లో॥ భాగ్యనాథోఽయన్నవాంశే తన్నాథోఽతుంగసంశ్రితః ।
లగ్నాధిపేనసంయుక్తో "నాళయోగ" ఉదాహృతః । 57

తా. భాగ్యాధిపతియొక్క నవాంశాధిపతిఉచ్చరాశిలోనుండి లగ్నాధిపతితో కూడి యున్నచో "నాళయోగ"మగును.

శ్లో॥ మనోహరోఽపి దారాణాం గురుప్రియకరస్తథా ।
కర్మకర్తా ప్రభుర్మాని "నాళే" వత్సప్తతేః పరమ్॥ 58

తా. నాళయోగమందు పుట్టినవాడు భార్యకు మనోహరుడు, గురువులకు హితమును చేయువాడు, సత్కర్మల నాచరించువాడు, ప్రభువు, మానముగలవాడు అగును. 76 సం॥రములు దాటిన ఆయువుగలవాడు అగును.

## 32. కార్ముక యోగము-ఫలము

శ్లో॥ లగ్నాంశకస్థే కర్మేశే కర్మాంశస్థేఽపిలగ్నపే ।
జీవదృష్టియుతౌ తౌ చేద్యోగః కార్ముకసంజ్ఞితః । 59

విద్వద్భిరన్వితోదక్షో ధైర్యవాన్ ప్రతిభానవాన్ ।
యోగేకార్ముక సంజ్ఞేతు నవమాబ్దాత్పరం సుఖీ ।
దాతాచశాస్త్ర విద్భోగీకులేశో రాజపూజితః । 60

తా. కర్మాధిపతి (దశమాధిపతి) నవాంశ లగ్నమందు, లగ్నాధిపతి దశమభావాంశమందుండగ వీరిద్దరు గురు దృష్టిగలవారైనచో "కార్ముక" యోగమని చెప్పబడినది.

ఈ యోగమందు పుట్టినవాడు పండితులతో కూడినవాడు, సమర్థుడు, ధైర్యము, ప్రతిభగలవాడు, తొమ్మిది సం॥ర తరువాత సుఖమనుభవించువాడు, దాత, శాస్త్రవేత్త, భోగి, కుల ముఖ్యుడు, ప్రభులచే పూజింపబడువాడు అగును.

వి॥ ఈ యోగమును నవాంశ చక్రమునుబట్టి నిర్ణయించవలెను. లగ్నాధిప కర్మాధిపతులను గురుడుచూచుట నవాంశచక్ర మందుచూడవలయును.

## 33. ఇంద్రయోగము-ఫలము

శ్లో॥ లాభేశే పంచమగతే లాభస్థే పంచమాధిపే ।
సుతస్థేవా చంద్రయుక్తే ఇంద్రయోగ ఇతీరితః ॥ 61

తా. లాభాధిపతి పంచమమందుండగ, పంచమాధిపతి, లాభమందు గాని, పంచమమందు గానియుండి చంద్రునితో కూడినచో "ఇంద్రయోగ" మనబడును.

శ్లో॥ ఆ చంద్రతారంగణనీయకీర్తి
ర్దేవేంద్రయోగే సముదగ్రవీర్యః ।
షట్త్రింశ దబ్దాత్పరమత్రజీవేత్ ।
రాజాధిరాజో బహుభోగయుక్తః ॥

తా. ఇంద్రయోగమందు జన్మించినవాడు శాశ్వతకీర్తి గలవాడు, మిక్కిలి పరాక్రమము కలవాడు, 36 సం॥ములు దాటిన తరువాత గొప్ప ప్రభుయోగముగలవాడు, భోగభాగ్యముల ననుభవించువాడు అగును.

వి. చంద్రుడు పూర్ణశుభుడై నప్పుడు ఈ యోగము మిక్కిలి శుభ ఫలములనిచ్చును.

వి. మేషలగ్న జాతకులకు లాభాధిపతియగు శని పంచమములో నుండగ పంచమాధిపతి లాభమందు చంద్రునితో కూడిన జాతకులకు పై యోగఫలము ఫలించలేదు.

ధనిష్ఠ 4వ పాదమందు జన్మించిన ఒక జాతకునకు లగ్నము మేషమై పంచమమందు శని కుంభమందు రవిచంద్రులుగలరు. ఇక్కడ చంద్రుడు క్షీణుడై బలహీనుడై యుండుటచేత 86 సం॥ రము తరువాత ప్రారంభించిన శనిదశ యోగించలేదు. ఈ దశలో సాధారణ లేఖకోద్యోగిగ జీవించెను. చంద్రబలము చాల ముఖ్యముగ నుండువలయును.

2 ఒక వృశ్చికలగ్న జాతకునకు పంచమమందు బుధుడు ఏకాదశ భావమగు కన్యయందు గురుచంద్రులుండగ గురుదశ 36 సం॥ ర మందు ప్రవేశించినది. ఈ దశలో జాతకుడు విశేష వ్యాపారము చేసి ధనార్జన మధికముగ చేసియుండెను. గృహ, భూమి, వాహనాదులను సంపాదించి సుఖభోగముల ననుభవించెను. చంద్రుడు పూర్ణచంద్రుడగుటయు, ధనభాగ్యాధిపతుల సంబంధము గ్రహించతగినది. ఈ యోగమందు చంద్రబలము ముఖ్యము.

## 34. గదాయోగము - ఫలము

శ్లో॥ ధనరాశిస్థితేచంద్రే గురుశుక్ర సమన్వితే ।
భాగ్యాధిపేనసందృష్టే గదాయోగ ఇతీరితః ॥ 62
లోకప్రధానపురుషోభవితాగుణాఢ్యో ।
మత్తేభ వాజిభటసంఘసమావృతస్స్యాత్ ।
షడ్వింశతేర్ద్వి గుణితాదపి చాబ్ద సంఘాత్
ఊర్ధ్వం గదాఖ్యఫలమీరితమింద్రవర్యైః ॥ 63

తా. చంద్రునకు ధనస్థానము గురుశుక్రులతో కలసియుండగ, భాగ్యాధి

పతిచే చూడబడినచో గదాయోగము పుట్టును. గదాయోగమందు పుట్టిన మనుజుడు లోకమందు ప్రధానుడు, గుణవంతుడు, రథగజతురగ భటాదిసహితుడైన ప్రభువై, 52 సం॥ రము నుండి 14 సం॥రము లమిత భోగాదులననుభవించును.

## 35. రవియోగము - ఫలము

శ్లో॥ ఆజ్ఞాస్థానంగతే సూర్యే తదీశే విక్రమస్థితే ।
రవిపుత్రేణ సంయుక్తే రవియోగ ఇతీరితః ॥ 64
భూపాలాస్యాక్షి తినాథవంద్య చరణశ్శాస్త్రార్థవిద్ధార్మికః ।
చత్వారస్త్రిగుణాస్సమాస్సభ పితా పంచాశదబ్దాత్పరమ్ ।
మేధావీసురతప్రియో నృపకలాదాక్షాంత భూమండలో
లభ్యాలోకమలాయతాక్షియుగళః పీనోరువక్షాంబరో ॥ 65

తా. లగ్నమునుండి దశమభావమందు సూర్యుడుండగ, దశమాధిపతి తృతీయమందు శనితో సంపూర్ణయుతి కలవాడైనచో "రవియోగ"మనబడును.

వి. ఈ యోగమందు పుట్టిన జాతకుడు అనేక ప్రభువులచే నమస్కరింపబడువాడు, మేధావి, స్త్రీప్రియుడు, అనేక ప్రభువులకు ప్రభువు, మితహారి, ప్రఫుల్లమైన సుందరమైన నేత్రములు గలవాడు, బలమైన ఊరువులు, వక్షస్థలము గలవాడు అగును. ఈ జాతకుని 50 సం॥రముల నుండి 12 సం॥రముల వరకు పై ఫలములను పూర్తిగ అనుభవించవలెను.

## 36. పారిజాతయోగము - ఫలము

భాగ్యాధిపస్థాంశపతి స్థితాంశమదాదివాధాయదితుంగసంస్థాః ।
లగ్నేశ్వరాత్కేంద్రగతాయదిస్యాచ్ఛుభేనయుక్తాస్సహి
పారిజాతః ॥ 66
రాజాధర్మపరాయణో నృపవరైర్వంద్యో ధనీశాస్త్రవి ।
త్ప్రాజ్ఞః కరుణానిధిర్వినయవాం స్త్రీపుత్రమిత్రాన్వితః ।

ఆచంద్రార్కయశాశ్కృతీసభవితా ద్వావింశదబ్దాత్పరం ।
యావజ్జీవమపారజాతవిభవః శ్రీపారిజాతోద్భవః ॥ 67

తా. భాగ్యాధిపతియొక్క నవాంశాధిపతియున్న నవాంశాధిపతి, షష్ఠ, సప్తమాధిపతులు, తమతమ ఉచ్చరాశులలోనుండి, లగ్నాధిపతినుండి కేంద్రరాశులందు శుభులతో కూడియున్న చో 'పారిజాతయోగ' మనబడును. ఈ యోగమందు పుట్టిన జాతకులు ధర్మపరాయణులు, ప్రభువులచేత నమస్కరింపబడువారు ధనవంతులు, శాస్త్రవేత్తలు, త్రికాలజ్ఞులు, కరుణతోకూడిన వారు, వినయము, సత్కళత్రము, సంతానము, సంపదలు గల వారు, స్థిరమైన కీర్తిగలవారు, నేర్పరులు, ఇరువదిరెండు సంవత్సరములనుండి జీవితాంతము సంపూర్ణ వైభవముతో జీవించు వారునగుదురు.

వి. మేషధనుర్లగ్నములకు షష్ఠ సప్తమాధిపతులు, బుధశుక్రులు మీనలగ్నమునకు షష్ఠ సప్తమాధిపతులు రవి బుధులు ఏక కాలమందు తమతమ ఉచ్చరాశులందుండుట సంభవముకాదు.

## 37. గంగాప్రవాహయోగము - ఫలము

శ్లో॥ రంధ్రే గురుర్భృగుసుతేనయుతో యదిస్యాత్
కామే బుధశ్శనిగృహే చరభే యదిస్యాత్ ॥
స్త్రీపుత్రలాభభవనేషు రవీందుమందా ।
గంగాప్రవాహ ఇహ యోగవరః ప్రదిష్టః ॥ 68
తేజస్వీ బహువిత్తదారతనయః
కల్యాణయుక్తో నృపో ।
విద్యావాదవినోదగోష్ఠిషురతో గోవాజినాగాన్వితః ।
దీర్ఘాయుర్ద్విజతేంద్రియో వినయవాన్గంగా ప్రవాహోద్భవ
స్సానందమిత్రగణేన జీవతిపరం పుణ్యాయురారోగ్యవాన్ ॥ 69

తా. జన్మలగ్నమునుండి అష్టమమందు గురు శుక్రులు, చరరాశియైన

శని క్షేత్రము సప్తమభావమై యందు బుధుడుండగ, 7,5,11 భావములందు రవి చంద్ర శనులుండిరేని 'గంగాప్రవాహ యోగ'మనబడును.

ఈ యోగ జాతకులు తేజోవంతులు, విశేషధనము, పుత్రులు. భార్య గలవారు, మంగళప్రదమైన విషయములతో కూడిన వారు, ప్రభువులు, విద్యావినోదగోష్ఠులందు అభిరుచిగలవారు దీర్ఘాయువు, ఆరోగ్యము, వినయము, మిత్రులు గలవారై పూర్ణాయువు గలవారగుదురు.

వి. ఈ యోగము కర్కటకలగ్నమునుద్దేశించి చెప్పబడినది. లగ్నము కర్కటకమై చరరాశియగు శనిక్షేత్రమైన మకరము సప్తమమగుచుండగ దానియందు బుధుడు 8వ యింటిలో గురు శుక్రులు, 7వ యింటిలో రవి, 5వ యింటిలో చంద్రుడు 11వ యింటిలో శని యుండుటచేత నీ యోగము కర్కట లగ్నమునకు సరిపడును. కుజుని స్థితిని చెప్పలేదు. ఈ యోగమును సాధారణముగ విచారించినచో లగ్నాధిపతియగు చంద్రునకు పంచమమందు నీచస్థితి, వాహన భాగ్య లాభాధిపతులగు శుక్ర గురువుల కష్టమస్థితి, ధనతృతీయవ్యయాధిపతులగు రవి బుధులకు సప్తమస్థితి కలుగును. ఈ స్థితిలో ఏ గ్రహమునకు బలము పట్టినట్లు గోచరించదు. కాని గ్రంథకర్త విశేషయోగఫలములను తెలిపియుండెను. పుత్రభావమందు నీచగ్రహమున్నవృశ్చికమల్పపుత్రరాశి, శనిదృష్టి గురుని కష్టమస్థితి నీటివలన .పుత్రభావము చెడినదనియు, సప్తమములో రవి బుధులున్నచో కళత్రమును విడుచువాడనియు, లాభస్థానమందష్టమాధిపతియగు శని యుండుటచేత ఆదాయ హీనతను చెప్పదగియుండును. ఇది ప్రత్యేక యోగముగ గుర్తించుటచే దోషమును చెప్పుటకు అవకాశము లేదని గోచరించు చున్నది.

# 38. గజయోగము - ఫలము

॥ లాభేశా న్నవమాధీశస్సచంద్రో లాభసంస్థిత ః ॥
లాభాధిపేన సందృష్టో గజయోగ ఇతీరితః ॥ 70

వింశత్యబ్దాదూర్ధ్వం నవవత్సర మధ్యగస్సగజయోగః॥
యావజ్జీవ సుఖాఢ్యో గజవాజి యుతశ్చపుణ్యసుఖవృద్ధః॥ 71

తా. లాభాధిపతి యున్న రాశినుండి నవమాధిపతి చంద్రునితోకూడి లాభమందుండి, లాభాధిపతిచే చూడబడినచో "గజయోగ" మనబడును.

ఈ యోగమందు బుట్టినవాడు 20 సంll రములనుండి 9 సంllర ములలో అనగా 29 సంllరంలోపున గజయోగ ఫలమును పొందును. యావజ్జీవము సుఖము, ధనము, గజతురగాది వాహనములు కలవాడై విశేషపుణ్య కర్మలచేత, సుఖముగ జీవించును.

వి. ఉదాహరణమునకు మేషలగ్న జాతకులకు లాభాధిపతియగు శని సింహమందుండగ, శనినుండి భాగ్యాధిపతియగు కుజుడు చంద్రునితో చేరి లాభమగు కుంభమందుండగ శనిచే చూడ బడును. ఇట్లే ధనస్సులో శనియుండగ శనినుండి భాగ్యాధి పతియగు రవి చంద్రునితోకూడి లాభమందుండగ తృతీయ దృష్టితో శని చూచును.

1) మేషములగ్నమై పంచమమందు శని, లాభమందు కుజచంద్రులున్నప్పుడు.

2) ధనుస్సు (భాగ్యము)లో శని యుండిలాభమందు రవి చంద్రులున్నప్పుడు ఈ యోగము పట్టును. ఇట్లే యితర లగ్నముల కూహించవలయును.

## 39. శుభయోగము - ఫలము

శ్లో॥ భాగ్యనాథ స్థితాంశస్యనాథః స్వోచ్చసమన్వితః ।
ధనేశో భాగ్యరాశి స్థోయదియోగశ్శుభాహ్వయః ॥ 72
విద్యావినయ సంపన్నః కులధర్మ పరాయణః ।
ఆసప్తత్యబ్దజీవీస్యాచ్ఛుభయోగే సుఖీనరః ॥ 73

తా. భాగ్యాధిపతియొక్క నవాంశాధిపతి ఉచ్చరాశిగతుడై యుండగ, ధనాధిపతి భాగ్యరాశియందున్నచో 'శుభయోగ'మనబడును. ఈ యోగ జాతకుడు విద్యావినయసంపన్నుడు, కులాచార ధర్మములను ఆచరించువాడు, 70 సం॥రముల వరకు సుఖముగ జీవించువాడు అగును.

## 40. అమరయోగము - ఫలము

శ్లో॥ మదేశే ధర్మరాశిస్థే ధర్మేశే మదరాశిగే ॥
తయోర్బలవతో ర్దృష్ట్యా యుక్తోయోగోయమమరాహ్వయః॥ 74
అజానుబాహురరవిందదళాయతాక్షో
న్యాయాధికార నిపుణోమనుజై రుపాస్యః ॥
తీర్థాభిషేక రతిమానురుదార సౌఖ్యః
పంచాశదుత్తర సుఖీభవితాఽమరాఖ్యే ॥ 75

తా. లగ్నమునుండి సప్తమ భాగ్యాధిపతులు పరివర్తననొంది బలవంతులైనచో "అమర" యోగమనబడును. ఈ యోగ జాతకులు ఆజానుబాహువులు గలవారు, పద్మములవంటి నేత్రములు గలవారు, న్యాయాధికారులు, జనముచే సేవింపబడువారు, పుణ్య తీర్థములందు, దేవతారాధనములందను రక్తిగలవారు, దీర్ఘకాలము కళత్ర సుఖము గలవారు, 50 సం॥రములనుండి జీవితాంతము సుఖముగలవారు అగుదురు.

## 41. కామినీయోగము - ఫలము

శ్లో॥ ధనేజీవే సుఖేశుక్రే కామేచంద్రే భవేకుజే ।
లగ్నాధిపే శుభయుతే కామినీయోగ ఈరితః । 76

నగర గ్రామ నాథశ్చ భోగభాగ్య ప్రతాపవాన్ ।
కామినీ యోగజో మర్త్యో మధ్యపూర్ణాయురుచ్యతే ॥ 77

తా. ధనమందు గురుడు సుఖమందు శుక్రుడు, సప్తమమందు చంద్రుడు, ఏకాదశమందు కుజుడుండగ, లగ్నాధిపతి శుభగ్రహములతో కూడియున్న యెడల "కామినీ" యోగమగును. ఈ యోగమందు పుట్టినవాడు గ్రామ నగరాధిపతి, భోగభాగ్యములు, పరాక్రమము గలవాడు, మధ్యమాయువులో పూర్ణాయువు గలవాడు అగును.

## 42. నాళీక యోగము—ఫలము

శ్లో॥ పంచమాధిపతౌ భాగ్యే ధనే చంద్రసమన్వితే ।
లాభాధిపేన సంయుక్తే యోగో నాళీక నామకః ॥ 78
రాజాధిరాజమాన్యశ్చ వాగ్మీ షోడశదాన కృత్ ।
నాళీక యోగజో మర్త్యో జీవేత్పంచాశదుత్తరమ్ ॥ 79

తా. పంచమాధిపతి భాగ్య భావమందుండగ, ధన భావమందు చంద్రుడు లాభాధిపతితో చేరినచో "నాళీక" యోగమనబడును. ఇట్టి జాతకుడు ప్రభువులచే పూజింపబడువాడు. వక్త, షోడశ మహాదానములను చేయువాడు, 50 సం॥రములు పైన జీవించువాడు అగును.

## 43. విద్యుద్యోగము - ఫలము

శ్లో॥ లాభేశే పరమోచ్చస్థే భృగుపుత్రేణ సంయుతే ।
లగ్నేశాత్కేంద్రభావస్థే విద్యుద్యోగ ఇతీరితః ॥ 80
త్యాగభోగరతో నిత్యం ధనాఢ్యశ్చ మహాప్రభుః ।
విద్యుద్యోగే తు సంజాతో యోగాబ్దాధా యునాష్టకమ్ ॥ 81

తా. లాభాధిపతి తన పరమోచ్చభాగమందుండి శుక్రునితో చేరి లగ్నాధిపతియున్న రాశినుండి కేంద్రగతుడైనచో 'విద్యుద్యోగ' మనబడును.

ఈ యోగమందు పుట్టినవారు త్యాగము భోగముగలవారు, ధనాఢ్యులు, ప్రభుయోగము గలవారు, 61 సం॥రము నుండి 8 సం॥రముల లోపున యోగఫలము ననుభవించు వారగును.

వి. 'యోగ' శబ్దమునకు అక్షర సంకేత ప్రకారము 31 సం॥రములని గ్రహించవలయును.

## 44. భద్ర యోగము - ఫలము

శ్లో॥ ధనేగురుయుతే చంద్రే ధనేశే లాభరాశిగే ।
శుభయుక్తే చ లగ్నేశే భద్రయోగః ప్రకీర్తితః ॥ 82
పరేంగితజ్ఞో మేధావీ కార్యాధ్యక్షో మహాధనీ ।
భద్రయోగ భవోమర్త్యోనీచాబ్దా ద్వత్సరత్రయే ॥ 83

తా. ధనభావమందు గురునితో చంద్రుడు కలిసి యుండగ, ధనాధిపతి లాభమందుండెనేని 60 సం॥రము నుండి 3 సం॥రముల లోపున ఈ యోగఫలము సిద్ధించును.

వి. "నీచ" శబ్దమునకు అక్షర సంకేత ప్రకారము 60 సం॥రములగును.

## 45. నృపయోగము-ఫలము

శ్లో॥ లగ్నేశస్థాంశరాశీశేసచంద్రగృహపేఖగే ।
మానాధిపేన సందృష్టే నృపయోగ ఇతీరితః ॥ 84
మంత్రీమాండలికో ధీరస్సేనానీర్బహు విశ్రుతః ।
నృపయోగేతు సంజాతో విభ్వాబ్దాద్వత్సరత్రయే ॥ 85

తా. లగ్నాధిపతియున్న అంశాధిపతి చంద్రుడున్న గృహాధిపతియై దశమాధిపతిచే చూడబడినచో "నృపయోగ" మగును.

ఈ జాతకులు మంత్రులు, మాండలికులు, ధీరులు, సైన్యాధిపతులు, ఖ్యాతిగలవారు అగుదురు. ఈ యోగఫలము 44 సం॥రమునుండి 3 సం॥రములలో సంభవించును.

వి. "చంద్రుడున్న రాశినాథుడే లగ్నాధిపతియొక్క నవాంశాధిపతియై దశమాధిపతిచే చూడబడినచో" యని భావము. 'విభు' శబ్దమునకు అక్షర సంకేత ప్రకారము 44 సం॥రములగును. "మాండలికుడు" అనగా 50 వేల గ్రామములకధికారముగల వాడని పూర్వులనిర్ణయము. ఈ విషయమై మయమతములో; "లక్షార్ధంయస్తు భుంక్తేస మండలీకోఽభిధానతః॥ అనిగలదు.

## 46. ధూమ యోగము - ఫలము

శ్లో॥ భౌమస్థితాంశనాథస్య త్రికోణే గురుభార్గవౌ ।
కర్మణిస్వోచ్చగేమందే ధూమయోగస్సుఖప్రదః॥ 86
సుఖీధనీమహాశూరో నృపపూజ్యోమహాబలః ।
ధూమయోగేతు సంజాతో నవాబ్దంధర్మవత్సరాత్॥ 87

తా. కుజనవాంశాధిపతియున్న రాశినుండి భాగ్యస్థానమందు లేక పంచమమందు గురు శుక్రులు, దశమమందు ఉచ్చలో శని యున్నచో "ధూమయోగ" మగును.

ఈ యోగజాతకులు సుఖము, ధనము, గౌరవము, పరాక్రమము, బలముగలవారగుదురు. ఈ యోగఫలము 59 సం॥రమునుండి 9 సం॥రములలోపున ఫలించును.

వి. కుజుడున్న నవాంశాధిపతి మకరమందుండగ వృషభమందు గాని, కన్య యందుగాని గురు శుక్రులుండగ, తులయందు శనియున్నప్పుడీ యోగము కలుగును.

"ధర్మ" శబ్దమునకు 59 సంఖ్యవచ్చును.

## 47. మృగయోగము-ఫలము

శ్లో॥ చంద్రేశస్థాంశరాశీశే శుభక్షే శుభసంయుతే ।
శుభేశేస్వోచ్చరాశిస్థే మృగయోగ ఉదాహృతః॥ 88
దానే కర్ణసమో మానేదుర్యోధనసమోబలీ ।
మృగయోగే ధనాఢ్యశ్చ సప్తత్యూర్ధ్వం నవాబ్దకే । 89

తా. అష్టమాధిపతియొక్క నవాంశరాశ్యధిపతి తొమ్మిదవయింటిలో శుభగ్రహములతో కూడి యుండగ, తొమ్మిదవ భావాధిపతి తనయొక్క ఉచ్చగతుడైనచో "మృగయోగ" మనబడును. మృగయోగమందు జన్మించినవాడు దానముచేయుటలో కర్ణ సముడు, అభిమానములో దుర్యోధన సముడుగ నుండును. బలవంతుడు, ధనవంతుడుఅగును ఈ యోగఫలము 70 సం॥ రములనుండి 79 సం॥రములలోపున సంభవించును.

వి. "శుభ క్షే"మనగా నవమభావము. శుభేశుడనగా నవమాధిపతియని గ్రహించవలయును.

## 48. గాంధర్వయోగము - ఫలము

శ్లో॥ కామ త్రికోణేషు చరాజ్యనాథ
స్సురార్చితో లగ్నపసంయుతశ్చ ।
దివాకరస్తుంగగతో బలాఢ్యో
గాంధర్వయోగో నవమేశశాంకః ॥ 90
గాంధర్వ విద్యానిపుణో బలాఢ్యో
భోగేసువేషస్సయశా మనుష్యః ॥
గాంధర్వ యోగోద్భవ ఏషజీవే
త్షష్ట్యుత్తరం చాష్టసు వత్సరేషు ॥ 91

తా. సప్తమభావమునుండి త్రికోణరాశులందుదశమాధిపతియుండగ గురుడు లగ్నాధిపతితో కూడి యుండగ, రవి తన ఉచ్చరాశియందు, చంద్రుడు తొమ్మిదవ రాశియందున్నచో "గాంధర్వయోగ"మనబడును. గాంధర్వయోగ జాతకులు గాంధర్వ విద్యలయందు నిపుణులు, బలాఢ్యులు, భోగులు, మంచివేషము గలవారు, సత్కీర్తి గలవారు, 68 సం॥రములు జీవించువారు అగుదురు.

వి. జన్మలగ్నమునుండి 3, 11 రాశులలో దశమాధిపతియుండి మేషమందు రవి ఉచ్చలోనుండి భాగ్యభావమందు చంద్రు

దుండగ, లగ్నాధిపతి గురునితో కూడియున్నప్పుడీ యోగము పట్టును.

## చండయోగము-ఫలము

శ్లో॥ ఉచ్చగ్రహే విలగ్నస్థే భూమిజేన నిరీక్షితే ।
శౌర్యేభాగ్యాధిపయుతే చండయోగ ఇతీరితః॥ 92
సేనానీర్వాహనాధ్యక్షో మంత్రిషుప్రవరోబలీ ।
చండయోగ భవోమర్త్యో ద్విపష్ట్యబ్దాత్పరం వసేత్॥ 93

తా. లగ్నమందొక ఉచ్చగ్రహముండి కుజునిచే చూడబడుచుండగ భాగ్యాధిపతి తృతీయమందున్నప్పుడు "చండ యోగము" పట్టును.

1) మేషమందు సూర్యుడుచ్చలో నుండగ, కుజుడు కన్య, తుల, మకరములందెందైననుండి రవిని చూచుచుండగ, భాగ్యాధిపతియగు గురుడు తృతీయములోనున్నప్పుడు, (ఇక్కడ కుజుని వక్రస్థితియందు యోగ ప్రాబల్యము తగ్గును).

2) వృషభమందు చంద్రుడుచ్చలోనుండగ, తుల, వృశ్చిక కుంభములందెందైనను కుజుడుండి చంద్రుని చూచుచుండగ, భాగ్యాధిపతి శని కర్కాటకములో నున్నప్పుడు,

3) కర్కాటకమందుచ్చలో గురుడుండి, ధనుర్మకర మేషములలో నెందైనను కుజుడుండి గురుని చూచుచుండగ, భాగ్యాధిప గురుడు తృతీయమందుండుట సంభవముకాదు కనుక ఈ యోగమును చెప్పుటకు అవకాశము లేదు.

4) కన్యయందు బుధుడుచ్చస్థితిలోనుండి, కుంభ, మీన, మిధునములలో నెందైనను కుజుడుండి బుధుని చూచుచుండగ, తృతీయమందు భాగ్యాధిపతియగు శుక్రుడున్నప్పుడు.

5) లగ్నము తులయై అందు శనియుండి ధనుస్సులో బుధు డుండగ, మీన, మేష, కర్కాటకములలో నెందైనను కుజుడున్నప్పుడు.

6) మకర లగ్నమునకీ యోగము పట్టదు. కాని లగ్నమందు కుజుడుచ్చలో నుండగ, తృతీయమందు భాగ్యాధిపతియగు బుధుడుండుటచే నీ యోగఫలములుకొన్ని సంక్రమించును.

7) మీన లగ్నమునకు లగ్నమందు శుక్రుడుచ్చలో నుండగ, భాగ్యాధిపతియగు కుజుడు తృతీయములో నున్నప్పుడు శుక్రునిపై కుజదృష్టి సంభవముకాదు. కనుక యీ లగ్నమునకీ యోగము సరిపడదు. కాని కొన్ని ఫలములు సరిపడును.

## 50. నాగేంద్రయోగము - ఫలము

శ్లో॥ సప్తమేశాద్భాగ్యరాశౌ లగ్నేశాద్భాగ్యనాయకః ।
సురార్చితేన సందృష్టో యోగో నాగేంద్రనామకః 94

తా. లగ్నాధిపతియున్న రాశినుండి భాగ్యాధిపతి, సప్తమాధిపతియున్న రాశినుండిభాగ్యమందుండి గురునిచేచూడబడినచో 'నాగేంద్ర యోగ'మనబడును.

సుందరస్సుభగో విద్వాన్నాగేంద్రాహ్వాయయోగజః।
ఆషష్టాబ్దాత్తథాజీవం సుఖీభవతి విజ్వరః ॥ 95

తా. నాగేంద్రయోగజుడు సుందరమైన రూపముగలవాడు, భాగ్యవంతుడు, విద్వాంసుడు అగును. 6 వ సం॥రము నుండి జీవితాంతము రోగములులేనివాడై సుఖజీవనమును చేయును.

## 51. మకుట యోగము - ఫలము

శ్లో॥ భాగ్యేశాద్భాగ్యగేజీవే జీవాద్భాగ్యగతేశుభే ।
మందేకర్మణి సంప్రాప్తే యోగోమకుట నామకః ॥ 96

వనదుర్గాధిపో రాజా కిరాతపతి రూర్జితః ।
ఖలోబలీచ మకుటే జాతో ద్వాత్సర త్రయమ్ ॥ 98

తా. భాగ్యాధిపతి నుండి భాగ్యస్థానమందు గురుడు, గురునకు భాగ్యస్థానమందొక శుభుడు, లగ్నాద్దశమమందు శనియుండగ, "మకుట యోగ"మనబడును.

ఈ యోగజాతకుడు 31 సం॥రము నుండి 3 సం॥రములలో వన వనములకు, దుర్గములకు అధిపతిగాని, ప్రభువుగానియగుట, లేక కిరాతులకు ప్రభువగుట సంభవించును. ఈ జాతకుడు ఘృణమైనవాడు, దుర్మార్గుడు, బలవంతుడు అగును.

## 52. చిత్రయోగము-ఫలము

శ్లో॥ ధనేశే భాగ్యరాశిస్థే భాగ్యేశే లాభసంయుతే ।
లాభేశే పరమోచ్చస్థే చిత్రయోగః ప్రకీర్తితః ॥ 99
చిత్రయోగే మహాబుద్ధిః కలాసు నిపుణః కృతీ ।
రాజవంశోద్భవ రాజా వా జీవేత్సప్తతి వత్సరాన్ ॥ 100

తా. ధనాధిపతి భాగ్యమందు, భాగ్యాధిపతి లాభమందుండగ, లాభాధిపతి పరమోచ్చగతుడైనచో "చిత్రయోగ"మనబడును, చిత్రయోగమందు పుట్టినవారు రాజవంశమందు పుట్టినవారుగాని, లేక ప్రభువులు గాని, అగుదురు. మరియు విశేష బుద్ధిమంతులు, కలలయందు నైపుణ్యముగలవారు, నేర్పరులు అగుదురు.

వి. ఉదాహరణమునకు మేషలగ్న జాతకులకు శుక్రుడు ధనస్సునందు, గురుడు కుంభమందుండగ, శని తులయందు పరమోచ్చను పొందిన జాతకునకీ యోగము ప్రాప్తించును. ఇక్కడ ధనాధిపతి భాగ్యములోనుండగ లాభాధిపతియొక్క తృతీయ దృష్టి, లాభాధిపతియగు శనికి భాగ్యాధిపతి గురుని విశేషదృష్టి కలుగుటచే నీ యోగము ప్రశస్తఫలమునిచ్చును. ద్వాదశలగ్నములలో ఈ యోగము సింహ, తుల, ధనుః కుంభ, మీన లగ్నములకు వర్తించుటలేదు.

గ్రంథకర్త చెప్పిన మూడు కారణములు సమానముగపట్టి నప్పుడు సంపూర్ణ యోగఫలము కలుగును. లేని యెడల యీ యోగమును చెప్పకూడదు. ఉదా : కన్యాలగ్నమునకు ధనాధిపతి శుక్రుడు భాగ్యమందు, లాభాధిపతి చంద్రుడు పరమోచ్ఛలో నుండుట సంభవించును. భాగ్యాధిపతియగు శుక్రుడు లాభమందుండుట సంభవించదుగాన యీ యోగము పట్టలేదనియే గ్రహించవలయును. ఇచ్చట ధనభాగ్యలాభాధి పతుల సంబంధఫలమునే చెప్పవలయును. ఇట్లు ఆలోచించి నిర్ణయించవలయును.

## 53. వృష్టి యోగము-ఫలము

శ్లో॥ కర్మ భావాంశపేమధ్యే తుంగే చంద్ర సమన్వితే ।
నిశాయాం చరలగ్నే చ వృష్టియోగస్సమీరితః ॥ 101
కృషివాణిజ్య నిపుణో ధనవాన్వృష్టి యోగజః॥
పంచవింశాబ్దతస్సౌఖ్యం యాత్యాజీవం చిరాయసః ॥ 102

తా. రాత్రియందు జననమై లగ్నము చరరాశియై యుండగ, దశమాధిపతియొక్క నవాంశాధిపతి దశమమందుచ్ఛలో చంద్రునితో కూడియున్నచో "వృష్టి యోగ" మనబడును.
ఈ యోగమందు జన్మించిన జాతకులు కృషియందు, వాణిజ్యమునందు నిపుణులు, ధనవంతులు అగుదురు. 25 సం॥రమునుండి జీవితాంతము విశేష సుఖమును పొందగలరు.

వి. ఈ యోగము రాత్రియందు జన్మించిన చరలగ్న జాతకులకు మాత్రమే పరిమితమై యున్నది.

## 54. చండికా యోగము-ఫలము

శ్లో॥ షష్ఠేశ సంయుక్త నవాంశనాథో ।
భాగ్యేశ్వరాంశే రవి సంయుతశ్చేత్ ॥
స్థిరేవిలగ్నే రిపునాథదృష్టె ।
శ్రీ చండికాయోగ ఇతి ప్రసిద్ధః ॥ 103

శూరోదాతాధనాధ్యశ్చ మంత్రీమాన్యో మహాయశాః।
చండికాయోగ సంజాత శ్శతవర్షాధికస్సుఖీ ॥ 104

తా. జన్మలగ్నము స్థిరరాశియై షష్ఠాధిపతిచే చూడబడుచుండగ, షష్ఠాధిపతియొక్క నవాంశాధిపతి భాగ్యాధిపతియొక్క నవాంశ మందు రవితోకూడినచో "(శ్రీ) చండికాయోగ" మనబడును. ఈ యోగజాతకులు శూరులు, దాతృత ముగలవారు, ధనాధ్యులు (కోశాధ్యక్షులు) మంత్రులు, మాన్యులు, గొప్ప కీర్తి కలవారు, నూరు సం॥రముల కంటె అధికముగ సుఖ జీవనము చేయువారగుదురు.

వి. ఈ యోగము స్థిరరాశియందు జన్మించినవారికి మాత్రమే వర్తించును.

## 55. భూపయోగము-ఫలము

శ్లో॥ రాహుస్థితాంశ నాథస్య త్రికోణే సాధిపేయది।
భూమిపుత్రేణ సంయుక్తే భూపయోగః ప్రకీర్తితః ॥ 105
శత్రుహంతా సుసల్లాపస్సేనానీ రాజశేఖరః।
నృపయోగేతు సంజాతో రాజాబ్దాద్యేదవత్సరే ॥ 106

తా. రాహువుయొక్క నవాంశాధిపతియున్న రాశినుండి త్రికోణ రాశియందు తద్రాశ్యధిపతి కుజునితో చేరియున్నచో "నృప యోగ" మనబడును. ఈ యోగ జాతకుడు శత్రువులను నశింపచేయువాడు, బాగుగా మాట్లాడువాడు, సేనాని, ప్రభువు అగును. 16 సం॥రము నుండి 4 సం। రములలో పై యోగఫలములు గలుగును.

వి, "రాజాబ్దాత్" అను శబ్దములో గల "రా జ" శబ్దమునకు "షోడశమహారాజులు" అను పక్షములో 16 సం॥రమును అక్షర సంకేత ప్రకారము 32 సం॥రము చెప్పుటకు వీలగు చున్నది.

## 56. నాశీరయోగము-ఫలము

శ్లో॥ లగ్నేశ్వరే దేవగురౌ సుఖస్థే ।
చంద్రేయుతే సప్తమరాశి పేన ।
విలగ్ననాథే శుభఖేట దృష్టె ।
నాసిరయోగం ప్రవదంతి సంతః ॥ 107
అన్నదానరతో భోగీస్థూలగాత్రో మహాధనః ।
నాసీరయోగ సంజాతో గంగాబ్ధాదబ్ద మాత్రకే ॥ 108

తా. గురుడులగ్నాధిపతియై చతుర్థమందుండి, చంద్రుడు సప్తమాధిపతితో కూడియుండగ విలగ్నాధిపతి శుభగ్రహదృష్టి గలవాడైనచో "నాసీర" యోగమగును. ఈ యోగజాతకుడు 33-34 సం॥ర మధ్యమమునుండి అన్నదానరతుడు, భోగి, స్థూలకాయుడు, విశేషధనవంతుడు అగును.

వి. "విలగ్నము" అనగా పరాశరమందు విశేష లగ్నములుగ చెప్పినవానిలో నేదైననొక లగ్నము శుభవీక్షితము కావలయునని భావము.

1. హోరాలగ్నము 2. ఘటికా లగ్నము 3, భావలగ్నము 4. అంశలగ్నము 5. ద్రేక్కాణ లగ్నము 6. తారా లగ్నము, 7. ఇందు లగ్నము ఈ మతిమందీ లగ్నములకు విలగ్నములని సంజ్ఞగలదని, హోరాశాస్త్ర సంప్రదాయజ్ఞులు తెలిపినారు. పరాశరహోరాశాస్త్ర ద్వితీయ భాగమందు విలగ్నమును గురించి నేను వ్రాసిన వివరణమునుచూడగోరుచున్నాను.

ధనుర్లగ్నమునకు మీనమందు గురుడుండగ బుధ చంద్ర యోగముతో పాటు, విలగ్నమునకు శుభగ్రహ దృష్టి యున్నప్పుడు, మీన లగ్నమునకు సప్తమాధిపతి బుధునితో చంద్రుడు కలసియుండగ నాలుగవ భావమందు గురుడుండి, విలగ్నము శుభదృష్టి కలదైనప్పుడు పై యోగముఫలించును. ఇతర లగ్నములకీ యోగము సంభవించదు.

## 57. కంతుక యోగము-ఫలము

శ్లో॥ కర్మేశేభాగ్యరాశిస్థే ధనేశేలగ్నసంస్థితే ।
ధనకర్మగతౌ సౌమ్యౌ యోగః కంతుకనామకః ॥ 109
చాటువాక్య చతురోరిపుహన్తా ॥
దానధర్మ ధనభోగయుతశ్చ ॥
కంతుకే భవతి లాలితలోకః
పంచమాబ్దమవధిశ్శత వర్షాత్ ॥ 110

తా. దశమాధిపతి భాగ్యస్థానమందు, ధనాధిపతి లగ్నమందుండగ ద్వితీయ దశమములందు రెండు శుభగ్రహములున్నచో "కంతుక" యోగమనబడును. ఈ యోగమందు బుట్టినవారు ప్రియమైన వాక్యములను చెప్పుటలో నేర్పరులు. శత్రువులను నశింపచేయువారు, దాన, ధర్మ, ధన, భోగాదులతో కూడినవారు, ప్రజలవలన కోరికలను తీర్చుకొనువారు, నూటయైదు సం॥రముల వరకు ఆయుర్దాయము కలవారు అగుదురు.

## 58. ముసలయోగము-ఫలము

శ్లో॥ కర్మస్థానగతేరాహౌ కర్మపే స్వోచ్చరాశిగే ।
రవిపుత్రేణ సంద్రుష్టె యోగోముసల సంజ్ఞితః ॥ 111
పద్మపత్ర విశాలాక్షః ప్రసన్నవదనోబలీ ।
మంత్రీ వాణిజ్యధనవాన్ ముసలేరామజీవనః ॥ 112

తా. జన్మలగ్నమునుండి దశమమందు రాహువుండగ, దశమాధిపతి తన ఉచ్చరాశియందుండి శనిచే చూడబడెనేని "ముసల" యోగమనబడును.
ఈ యోగజాతకులు విశాలనేత్రములు గలవారు, ప్రసన్నమైన ముఖముగలవారు, బలవంతులు, మంత్రులు, (విశేషమైనఆలోచనాశక్తి గలవారు)వ్యాపారమువలన ధనమార్జించువారు, 62 సం॥రముల జీవనము గలవారగుదురు.

## 59. చంద్రికా యోగము-ఫలము

శ్లో॥ భాగ్యేశస్థితరాశీశో భాగ్యాత్పంచమగోయది।
లగ్నాత్పంచమగోభౌమశ్చంద్రికా యోగదాయకః॥ 113
బహుస్త్రీరమణో భూతశ్చంద్రికాయోగ సంభవః।
స్త్రీప్రజః పుత్రదుఃఖీచ సమాబ్ద సుఖజీవనః॥ 114

తా. భాగ్యాధిపతియున్న రాశినాథుడు భాగ్యాత్పంచమమందనగా లగ్నమందుండగ, లగ్నమునకు పంచమములో కుజుడున్నచో "చంద్రికా యోగ"మని పేరు.

ఈ యోగజాతకులు అనేక భార్యలు గలవాలు, స్త్రీసంతతి గలవాడు, పుత్రులు లేక దుఃఖించువారు, 57 సం॥ర ములు సుఖముగ జీవించువారు అగును.

## 60. దండయోగము-ఫలము॥

శ్లో॥ విక్రమాధిపతౌ స్వోచ్చేవిక్రమే గురుసంయుతే।
భృగుపుత్రేణ సందృష్టే దండయోగ ఇతీరితః। 115
గోభూధనసమృద్ధశ్చ బహుగ్రామాధిపః ప్రభుః।
దండయోగేతు సంజాతో జీవేదానాభి వత్సరమ్॥ 116

తా. విక్రమాధిపతి ఉచ్చరాశియందుండగ, విక్రమ స్థానమందు గురుడుండి శుక్రునిచే చూడబడినచో 'దండ' యోగ మనబడును.

ఈ యోగమందు బుట్టినవాడు గోవులు, భూమి, ధనము సమృద్ధిగగలవాడు, అనేక గ్రామముల కధిపతి, ప్రభువు అగును. 40 సం॥రములు నిండు వరకు జీవించును.

వి. ఈ యోగము మేష, కర్కాట, సింహ, తులా, మకర, మీన లగ్నములకు సంభవించదు. మిగిలిన లగ్నములకు సంభవించును.

## 61. రసాతలయోగము-ఫలము

శ్లో॥ వ్యయేశే పరమోచ్చస్థే వ్యయస్థే భృగునందనే।
సుఖాధిపేన సందృష్టే రసాతల ఇతీరితః। 117

యోగేరసాతలేజాతో భూమానిక్షేప కృద్ధనీ ।
ఆస ప్తత్యబ్ద జీవీచ రాజావా గాజసన్నిభః ॥ 118

తా. వ్యయాధిపతి పరమోచ్చగతుడై యుండగ, వ్యయమందు శుక్రుడుండి సుఖాధిపతిచే చూడబడినచో "రసాతల" యోగ మనబడును.

ఈ యోగమందు పుట్టినవారు భూమియందుదాచబడిన ధనము గలవారు, ధనవంతులు, ప్రభువులు లేక ప్రభుసమానులు 70 సం॥రములు జీవించువారు అగుదురు.

వి. ఈ యోగము మేష, సింహ, తులా, ధనుర్మకర లగ్నము లకు పట్టును.

## 62. యుగ్మయోగము - ఫలము

శ్లో॥ సుఖేశే శుభరాశిస్థే శుభగ్రహ సమన్వితే ।
సురార్చితేన సందృష్టే యుగ్మయోగః ప్రశస్యతే ॥ 119
ప్రాప్నోతి రాజవాల్లభ్యం రాజచిహ్నాని భోగవాన్ ।
యుగ్మయోగేతు సంజాతో యావజ్జీవ సుఖీనరః ॥ 120

తా. సుఖభావాధిపతి (వాహనాధిపతి) భాగ్యభావమందు శుభగ్రహ యుతుడై గురునిచే చూడబడినచో "యుగ్మ యోగ"మగును. ఈ యోగజాతకులు ప్రభువుల వాల్లభ్యమును పొందువారు, రాజచిహ్నములుగలవారు, భోగవంతులు, యావజ్జీవము సుఖమునొందువారు నగుదురు.

## 63. అంగుళయోగము-ఫలము

శ్లో॥ బుద్ధినాథ నవాంశేశ స్సుబుధస్తుంగ సంస్థితః ।
కర్మాధిపేన సంయుక్తో భవేదంగుళ యోగవాన్ ॥ 121
వస్త్రాభరణ సంయుక్తోగోభూధన సమన్వితః ।
చోరాన్వేషీచ మధ్యాయు శ్శ్రీమానంగుళ యోగజః॥ 122

తా. పంచమాధిపతియొక్క నవాంశాధిపతి బుధునితో కూడి ఉచ్చ లోనుండి దశమాధిపతితో కూడియున్నచో "అంగుళ" యోగ మనబడును.

ఈ యోగమందు పుట్టినవారు వస్త్రాలంకార భూషితులు, భూములు, గోవులు, ధనము గలవారు, దొంగలను అన్వే షించువారు. మధ్యమాయువు గలవారు, శ్రీమంతులు అగుదురు.

వి. ఈ యోగములో పంచమాధిపాంశాధిపతికి బుధసంబంధము ముఖ్యముఉచ్చలో లేకపోయినను పై ఫలములు సరిపడుచున్నవి పంచమ దశమాధిపతుల సంబంధమువలె, పంచమాధిప నవాం శాధిపతికి బుధునియొక్క, దశమాధిపతియొక్క సంబంధమును ముఖ్యముగ గ్రహించవలయును.

(64 వ యోగము లభించలేదు.)

## 65. భవ్యయోగము-ఫలము

శ్లో॥ రాజ్యస్థానగతే చంద్రే చంద్రాంశేశేతు తుంగగే।
భాగ్యేశే ధనపోపేతే భవ్యయోగః ప్రకీర్తితః॥ 123
మానధనైశ్వర్యయుతం ప్రాజ్ఞం బహుభాగినం కురుతే।
యోగోభవ్యాభ్యోయం సుగుణజాతంకలాసునిపుణంచ॥ 124

తా. చంద్రుడు దశమభావమందుండగ, చంద్ర నవాంశాధిపతి ఉచ్చలోనుండగ, భాగ్యధనాధిపతులు కలసినప్పుడు "భవ్య" యోగమనబడును.

ఈ యోగజాతకులు అభిమానము, ధనము, ఐశ్వర్యము గల వారు, విశేషజ్ఞులు, అధికభోగభాగ్యములుగలవారు, సుగుణ ములు గలవారు, కళలందు నేర్పరులు అగుదురు.

వి. ఈ యోగమందు చంద్రుడు పూర్ణశుభుడై యుండవలయును. పూర్ణశుభుడై నీచయందున్నను యోగము ఫలించదు.

## 66 భోగియోగము-ఫలము

శ్లో॥ భాగ్యాధిపస్య ద్రేక్కాణే రాజ్యనాథేస్థితేసతి।
రాజ్యంగతే సురాచార్యే భోగియోగస్సుఖప్రదః॥ 125
రాజరాజసమో భోగీ స్త్రీణాంనేత్రోత్సవప్రదః।
భోగియోగేతు సంజాతో జీవేద్రం భాబ్దతఃపరమ్॥ 126

తా. రాజ్యస్థానాధిపతి భాగ్యాధిపతితోయొక్క దేక్కాణమునుపొంది యుండగ, రాజ్యభావమందు గురుడున్నచో 'భోగి' యోగ మనబడును.

ఈ యోగజాతకుడు విశేషసుఖమును పొందువాడు, రాజ సముడు, భోగి, స్త్రీలకు ఆనందమును కలిగించువాడు (మిక్కిలి రూపవంతుడని భావము) 24 సం॥రములు మాత్రమే జీవించు వాడు అగును.

వి. ఆయుర్యోగముల ప్రాబల్యముగల జాతకులు అధిక వర్షములు జీవించగలరు.

## 67. గారుడయోగము-ఫలము

శ్లో॥ చంద్రస్థిత నవాంశేశస్తుంగస్థః పూర్వపక్షకే ।
దివాజన్మనియోగోఽయం గారుడో నామసౌఖ్యదః ॥ 124
సత్పూజ్యో మృదుభాషీచ శత్రుహంతా బహుబలః ।
యోగేతు గారుడేజాతో వేదాబ్దో విషవర్జితః ॥ 125

తా. శుక్లపక్షమందు పగలు జన్మించినవారికి చంద్రనవాంశాధిపతి తన యుచ్చరాశిలోనుండెనేని గారుడ యోగమనబడును. ఈ యోగమందు పుట్టినవారు సౌఖ్యముగలవారు, సత్పురుషులచే పూజింపబడువారు, మృదువుగ మాట్లాడువారు, శత్రువులను జయించువారు, గొప్పబలవంతులు 84 సం॥రములు జీవించువాడు విషవర్జితుడు అగును.

వి. విషవర్జితుడనగా విషాదులవలన బాధలులేనివాడని గ్రహించవలెను. సర్పాది విషజంతు భీతిలేనివాడు, శరీరమునకు విషప్రయోగాదులను చేసినను, వానివలన రక్షింపబడువాడు అగును. గారుడ యోగము అనుటచేత విషసంబంధమైన దోషములను గారుడమంత్రము నశింపచేసి రక్షించుననిసంప్రదాయజ్ఞుల యభిప్రాయము.

## 68. దేవయోగము-ఫలము

శ్లో॥ లగ్నాధిపస్య ద్రేక్కాణే భాగ్యేశ స్తన్నవాంశపః ।
తిష్ఠతశ్చేద్దివాజన్మ దేవయోగ ఇతీరితః ॥ 126
నానావిధమథైశ్వర్యం కీర్తిర్బుద్ధిర్యశో బలమ్ ।
దేవయోగేతు జాతస్య ద్వాత్రింశద్వత్సరావధి ॥ 127

తా. భాగ్యాధిపతి, వానినవాంశాధిపతి ఇద్దరు లగ్నాధిపతియొక్క ద్రేక్కాణమందుండగ, పగటియందు జన్మించినచో దేవ యోగమనబడును,

ఈ యోగమందుబుట్టినవారు బహువిధ సంపదలుగలవారు, బుద్ధి, యశస్సు, బలము, కీర్తి కలవారగును. 32 సం॥రములు దాటిన పిమ్మట యీ యోగఫలములు సంభవించును.

## 69. ధర్మయోగము-ఫలము

శ్లో॥ జీవేన శుక్రేభాగ్యస్థే లాభనాథేన సంయుతే ।
ధనాధిపేనసందృష్టే ధర్మయోగ ఇతీరితః ॥ 128
సేనాధికారీ ధనవాన్యుద్ధ కాంక్షీ మహాబలః ।
ధర్మయోగేతు సంజాతో దాతాభవతి ధార్మికః ॥ 129

తా. శుక్రుడు గురునితోను, లాభాధిపతితోను భాగ్యభావమందుం డగ ధనాధిపతిచే చూడబడెనేని "ధర్మయోగ" మనబడును. ఈ యోగజాతకులు సైన్యాధిపతులు, ధనవంతులు, యుద్ధా భిలాషులు, బలవంతులు, దాతలు, ధార్మికులు నగుదురు.

వి. 1. మేషలగ్న జాతకులకు భాగ్యభావమందు శుక్ర గురు శను లుండుటచే నీ యోగము కలుగును. శుక్రుడే ధనాధిపతియగు టచే ధన, భాగ్యరాజ్య లాభాధిపతుల సంబంధము భాగ్యభావ మందుండుటచేత ధర్మశీలురు, దాతలు, ధనవంతులు అగు దురు. సైన్యాధిపత్యము కలుగకపోయినను, జనసామాన్య మందు గౌరవమును, అధికారమును పొందగలరు.

2. వృషభ లగ్న జాతకులకు భాగ్యభావమగు మకరమందు శుక్ర గురువుల సంబంధమువలన లాభాధిపతి సంబంధముకూడా పట్టును, కాని ధనాధిపతియగు బుధునిదృష్టి కలుగదు. విశేష దృష్టుల ప్రకారము వృశ్చికరాశి గతుడగు బుధుడు తృతీయ దృష్టితో శుక్రగురువులను చూచునని చెప్పవలయును. అట్లయినను లాభాధిపతియగు గురువునకు నీచపట్టుటచేత నీ జాతకులకీ యోగము ఫలించదని తోచును.

3. మిథున లగ్న జాతకులకు భాగ్యభావమగు కుంభమందు శుక్ర గురు కుజలుండుటచే శుక్రునకు గురు, లాభాధిపతుల సంబంధము కలిగును. సింహమందు ధనాధిపతియగు చంద్రుడుండి శుక్రగురుకుజులను చూచును. ఈ యోగమందు చంద్రునకు 7వ యింటిలో గురుశుక్రులవలన అధియోగముగూడ మిశ్రమముగ సంక్రమించును. వీరికీ యోగముఫలించును. రాజ్యాధిపతియగు గురునకు భాగ్యస్థితి పంచమ కోణాధిపతి సంబంధము వలన రాజయోగప్రాప్తి, కుజుడు యుద్ధకారకగ్రహమగుటచే సైన్యాధిపత్యము, యుద్ధాభిలాషిత్వముకూడా కలుగునని చెప్పవచ్చును.

4. కర్కాటక లగ్నజాతకులకు శుక్రుడు 9వ యింటి యందు గురునితో చేరుట కుదురును. ధనాధిపతియగు రవి వీక్షణము సంభవించదు. తృతీయ దృష్టితో రవి చూచుట కవకాశము కలుగును.

ఈ యోగములో వాహనభాగ్య లాభాధిపతుల సంబంధము, శుక్రుని కుచ్చస్థితి, గురునకు స్వక్షేత్రస్థితివలన ధనయోగము, ధార్మిక ప్రవృత్తి, దాతృత్వమును చెప్పవచ్చును.

5. సింహలగ్న జులకు భాగ్యభావమగు మేషమందు శుక్రగురుబుధులుండుటచేత నీ యోగము పట్టును. కాని బుధుడే ధనాధిపతి యగుటచే ధనాధిపతి వీక్షణ ముండదు. ఈ కలయిక ధన

పంచమ రాజ్యలాభాధిపతుల సంబంధము కనుక ధనయోగము, ధార్మికత్వము, దాతృత్వము కలుగును. అష్టమాధిపతి భాగ్యమందుండుటచేత భాగ్యనష్టమునుగూడ సూచించును. మూడు శుభగ్రహములు 9వ యింటిలో నుండుట విశేష శుభము. రాజ్యాధిపతి భాగ్యమందు అష్టమాధిపతితో కలియుటవలన కొన్ని దోషములుకూడ సంక్రమించును.

6. కన్యాలగ్నజులకు భాగ్యభావమగు వృషభమందు శుక్ర గురు చంద్రుల కలయికవలన పై యోగము పట్టును. శుక్రుడే ధనాధిపతి యగును. భాగ్యభావమందు ధన, వాహన, భాగ్య, లాభాధిపతుల సంబంధమువలన ధనము, దాతృత్వము, ధార్మికత్వము సంభవించును. జనసామాన్యమందు గౌరవముండును,

7. తులాలగ్నజులకు శుక్రుడు గురునితో కలసి భాగ్యభావమగు మిధునమందుండగ, లాభాధిపతియగు రవితో కలసినప్పుడు, గురుశుక్రుల కస్తమయ దోషముండరాదు. కుజుడు వృశ్చిక ధనుర్మీనములలో నున్నప్పుడు వీరిని చూచును. ఇక్కడ కుజ దృష్టి రవి భాగ్యస్థితి పైన్యాధికారయోగమునకు హేతువు లగును. తృతీయ షష్ఠములందున్న కుజదృష్టి యెక్కువ సహకరించును. రవితో గురుశుక్రులు కలసి మిధునములో నుండగ గురుశుక్రు లస్తమించరాదు. అస్తమించినచో యోగఫలము తప్పిపోవును.

8. వృశ్చిక లగ్నజులకు భాగ్యమందు శుక్ర గురు బుధులుండుట వలన యీ యోగము పట్టును. గురునకు ధనాధిపత్యము, ఉచ్చము సంభవించును. ఈ యోగమందు ధనము, దాతృత్వము, ధార్మికత్వము కలుగును.

9. ధనుర్లగ్న జాతకులకు భాగ్యభావమగు సింహమందు శుక్రుడు గురునితో కూడియుండగ, ధనాధిపతియగు శనిచే చూడబడి

నప్పుడీయోగము పట్టును. శుక్రుడే లాభాధిపతియగును. శని వృశ్చిక, కుంభ, మిథునములలో నెక్కడున్నను గురుశుక్రులను చూచును. కాని కుంభములోనుండి చూచినప్పుడి ఫలములనుభవములో సరిపడును.

10. మకరలగ్నజులకు కన్యయందు శుక్ర గురు కుజులుంతగ శనిచే చూడబడినప్పుడీ యోగము సంభవించును. శని 3, 7 స్థానములందుండి చూచినచో యోగఫలములు బాగుగ సంభవించును. శుక్రుడు నీచ భాగలను దాటియుండుటమంచిది.

11. కుంభలగ్న జాతకులకు భాగ్యభావమందు శుక్రగురువు లుండుట వలన యీ యోగము కలుగును. కాని గురుడే లాభాధిపతి ధనాధిపతి యగుటవలన గ్రహాంతరదృష్టి లేనందున యోగమునకు పాలిబల్యము తక్కువగ నుండును. ఇట్టివారు ధార్మికులు, దాతలు మాత్రమే అగుచున్నారు.

ధర్మస్థానమందు (భాగ్యభావమందు) గురు శుక్ర యుతిఫల విషయమై వృద్ధయవన జాతకము 48 వ అ। 19వ శ్లోకములో

ధర్మాశ్రితౌ దేవగురుస్స శుక్రో
నరంప్రసూతేఽర్థ యశోనిధానమ్ ।
సుపుత్రరక్తం విభవైస్సమేతం ।
మాయావిహీనం సుతిపల్లభం చ ॥

అనుటచేత శుక్రగురువుల భాగ్యస్థితిగల జాతకులు ధనము, యశస్సు గలవారు, సుపుత్రులతో కూడినవారు, వైభవోపేతులు, మాయారహితులు, సంతానమందు ప్రీతిగలవారగుదురని చెప్పబడినది. కనుక కుంభలగ్నజులకు 9వ యింటిలో శుక్రగురువులున్నప్పుడు పాక్షికముగ "ధర్మయోగ"ము పట్టినందున వీరు సైన్యాధిపతులు, యుద్ధాభిలాషులు కానేరరని గ్రహించదగియున్నది.

## 70. క్రోధ యోగము

శ్లో॥ లాభేశ్వరదృగాణేతు సరాహౌబుద్ధినాయకే ।
భౌమాత్క్రూత్మ జేన సందృష్టే క్రోధయోగోఽపిసౌఖ్యదః॥ 130

ఫలము

పాపవిత్తార్జనపరో దానధర్మ పరాయణః ।
సాహసీ క్రోధయోగేతు క్రోధహర్ష భయాన్వితః ॥ 131

తా. పంచమాధిపతి లాభాధిపతియొక్క ద్రేక్కాణమందు రాహువుతో కలసి కుజునిచే చూడబడినచో "క్రోధ యోగ"మన బడును. ఈ యోగమందు బుట్టినవారు సుఖవంతులు, సాహస వంతులు, పాపకర్మల వలన ధనార్జన చేయువారు, దాన ధర్మ పరాయణులు, సాహసవంతులు, క్రోధము, సంతోషము, భయము కలవారగుదురు.

వి. పంచమాధిపతి వృషభములో 3వ ద్రేక్కాణమందు, మిథునంలో 3వ ద్రేక్కాణ మందు, కన్యలో 2వ ద్రేక్కాణ మందు, తులలో 2వ ద్రేక్కాణమందు, మకరమందు 1వ ద్రేక్కాణ మందు, కుంభమందు 1వ ద్రేక్కాణమందున్నప్పుడు ద్రేక్కాణ చక్రమందు పంచమాధిపతి రాహువుతో కలసి కుజునిచే (ద్రేక్కాణ చక్రమందు) చూడబడినప్పుడీ యోగము పట్టును ఉదాహరణమునకు మేషలగ్న జాతకునకు పంచమాధిపతియగు రవి వృషభమందు 3వ ద్రేక్కాణ మందుండగ, రాహువు కన్యలో 2వ ద్రేక్కాణమందున్నప్పుడు రవి (పంచమాధిపతి) రాహువులు లాభాధిపతియగు శనియొక్క ద్రేక్కాణములో నుండగలరు. మకరమందున్న యీ రవి రాహువులు మిథున, కర్కాటక, తులల్లో నొకరాశియందున్న (ద్రేక్కాణరాశి) కుజునిచేచూడబడెదరు. ఇట్టి సందర్భములో నీ యోగము పట్టును. ఇదే విధముగ నితరలగ్నముల కూహ్యములు.

# 71. రజ్జు యోగము

శ్లో॥ భాగ్యాధిపద్వాదశాంశే పంచమాధిపతౌస్థితే ।
పూర్ణ చంద్రేణ సంయుక్తే యోగస్స్యాద్రజ్జునాయకః॥ 182

ఫలము

విశాలాక్షో ధనీమానీ కీర్త్యాక్రాంత జగత్త్రయః ।
రజ్జుయోగేతు సంజాతో మధ్యాయుర్బహు పుత్రవాన్॥ 183

తా. పంచమాధిపతి భాగ్యాధిపతియొక్క ద్వాదశాంశములోనుండి సంపూర్ణ చంద్రునితోకూడినచో "రజ్జుయోగ" మనబడును. పై యోగమందు పుట్టిన జాతకులు విశాలమైన నేత్రములు గలవారు, ధనవంతులు, అభిమానముగలవారు, విశేష కీర్తివంతులు, మధ్యమాయువు గలవారు, బహుపుత్రులు గలవారు అగుదురు.

వి. 1. మేషలగ్న జాతకులకు పంచమాధిపతియగు రవిగురుద్వాదశాంశములో నున్నను, చంద్రునితో కలియుట క్షీణచంద్రునితో కలియుట యగుటచే వీరికీయోగము పట్టదు.

2. వృషభలగ్నమునకు పంచమాధిపతి బుధుడు భాగ్యాధిపతియగు శని ద్వాదశాంశములోనున్నను క్షీణచంద్రునితో కలియుటయే యగును. వీరికి యోగము పట్టదు.

3. మిథునలగ్నమునకు పంచమాధిపతియగు శుక్రుడు భాగ్యాధిపతియగు శని ద్వాదశాంశములోనున్నను క్షీణచంద్రునితో కలియుటయేయగుటచే వీరికీయోగము పట్టదు.

4. కర్కాటక లగ్నమునకు పంచమాధిపతి కుజుడు భాగ్యాధిపతియగు గురుని ద్వాదశాంశములో నుండగ పూర్ణచంద్రునితో కలయుట కవకాశముండుటచే నీ యోగము వీరికి పట్టును.

5. సింహ, కన్యా, తులా, వృశ్చిక, ధనుర్లగ్నములకు యీ యోగము పట్టును-మకర-కుంభ-మీనములకు పట్టదు.

మీన లగ్నమునకు పంచమాధిపతియగు చంద్రుడు పూర్ణ చంద్రుడై భాగ్యాధిపతియగు కుజద్వాదశాంశమును పొందిన ప్పుడు వికల్పముగ నీ యోగమును చెప్పవచ్చును. వీరికి యోగఫలములు కలుగును.

## 72. అంగ యోగము-ఫలము

శ్లో॥ కేంద్రత్రికోణ నాథానాం త్రింశాంశేశాశ్శుభాయది ।
అంగయోగ ఇతిఖ్యాతః సర్వదా సుఖజీవనః ॥ 134

తా. కేంద్ర త్రికోణాధిపతులయొక్క త్రింశాంశాధిపతులు శుభులైనచో "అంగయోగ" మనబడును. ఈ యోగమందు బుట్టిన వారు సుఖముగ జీవనమును చేయుదురు.

### త్రింశాంశఫలము

శ్లో॥ కుజః కోపీ శనిః క్రూరో గురుఃపుణ్యఫలప్రదః ।
బుధోజ్ఞానీ భృగుస్త్యాగీ త్రింశాంశకఫలం త్విదమ్॥ 135

తా. త్రింశాంశాధిపతి కుజుడైనచో కోపముగలవాడు, శనియైనచో క్రూరుడు, గురుడైనచో పుణ్యఫలప్రదుడు, బుధుడైనచో జ్ఞానవంతుడు, శుక్రుడైనచో త్యాగశీలుడు అగును. ఇది త్రింశాంశఫలముగ గ్రహించవలయును.

వి. 1, 4, 5, 7, 9, 10 స్థానాధిపతులగు గ్రహములు బుధ, గురు శుక్ర త్రింశాంశములందున్నప్పుడే 'అంగయోగము'కలుగును.

## 73. గోళయోగము-ఫలము

శ్లో॥ సంపూర్ణ చంద్రే భాగ్యస్థే గురుశుక్ర సమన్వితే ।
లగ్నాంశకే బుధయుతే గోళయోగః ప్రకీర్తితః ॥ 136

తా. సంపూర్ణ చంద్రుడు భాగ్యరాశియందు గురుశుక్రులతో కలసి యుండగ, లగ్నము బుధనవాంశమును పొందినచో "గోళయోగ"మనబడును.

విద్యావినయ సంపన్నోయుక్తిచిద్గ్రామనాయకః ।
చిరాయుర్మిష్టభోజీచ గోళయోగ భవోనరః ॥ 137

తా॥ గోళయోగమందు జన్మించినవారు విద్యా వినయములు గల వారు కొన్ని గ్రామములకు నాయకులు, దీర్ఘాయువుగలవారు, మృష్టాన్నభోజనమును చేయువారు అగుదురు.

వి॥ గురు శుక్రులతో చంద్రుడు కలియుటలో చంద్రుడు పూర్ణ చంద్రుడై యుండవలయునని తెలిపియుండెను.

రవినుండి 3, 11 రాశులలో శుక్రుడున్నప్పుడు చంద్రుడుగూడ శుక్రునతో కలసి ఆ రాశులలోనే యుండును. ఈ స్థితిలో చంద్రుడు పూర్ణచంద్రుడగుట కవకాశము కలుగునా? యని విచారించవలసి యున్నది.

చంద్రుని శుభాశుభ నిర్ణయమును గురించి ''యవనేశ్వరుడు''
మాసేతు శుక్ల (ప్రతి పత్ప్ర)వృత్తే
రాద్యేశకే మధ్యబలో దశాహే।
శ్రేష్ఠో ద్వితీయేఽల్పబల స్తృతీయే।
సౌమ్యై స్తుదృష్టో బలవాన్సదైవ। అని
చెప్పిన వచనానుసారము శుద్ధ దశమి తరువాత చంద్రుడతి శుభుడగును. రవినుండి 120 భాగల దూరము తరువాతనుండు చంద్రుడని భావము.

## 74 గోయోగము - ఫలము.

శ్లో॥ మూలత్రికోణే వాగీశే సబవేచధనేశ్వరే।
లగ్నే శేస్వోచ్చరాశిస్థే గోయోగ ఇతి విశ్రుతః॥ 138

తా॥ గురుడు తన మూలత్రికోణ రాశియందుండగ, ధనాధిపతి బలవంతుడై, లగ్నాధిపతి తన ఉచ్చరాశియందున్నచో "గోయోగము" అగును.

మహాకులీనో సుభగో భోగీ భూపోధనీబలీ।
గోయోగసంభవోమర్త్యః పంచాశత్పరజీవనః॥ 168

తా॥ గోయోగమందు పుట్టినవారు గొప్పవంశమందు జన్మించు వారు, సుందరులు, భోగులు, ప్రభువులు, ధనవంతులు అగుదురు. ఏబది సంవత్సరములకుపైన జీవించు వారగుదురు.

## 75 మారుతయోగము - ఫలము

శ్లో॥ రాహు స్త్రిషష్ఠ లాభస్థో లగ్నం సౌమ్యయుతేక్షితమ్।
యోగోయం మారుతో నామ దురితాని వినాశయేత్ 139

తా॥ రాహువు 3, 6, 11 రాశులందుండగ, లగ్నము శుభగ్రహ యుతివీక్షణములు గలదైనచో "మారుతయోగ" మనబడును ఈ యోగజాతకులు పాపకర్మఫలము లేనివారగుదురు.

## 76 శ్రీమద్యోగము - ఫలము

శ్లో॥ ధర్మకర్మాధినేతారా వన్యోన్యస్యచ కేంద్రగా॥
జీవదృష్టా సలగ్నేశే శ్రీమద్యోగస్సుఖప్రదః॥ 140
యోగే శ్రీమతి సంజాతశ్శ్రీమాన్కార్యవిచక్షణః॥
భోక్తాదాతా మహామానీ చిరాయుర్భవతిధ్రువమ్॥ 141

తా॥ నవమదశమాధిపతులు పరస్పర కేంద్రగతులై గురుదృష్టిగలవారైనను, లగ్నాధిపతితో కూడియున్నను "శ్రీమద్యోగ" మనబడును.

ఈ యోగమందు పుట్టిన జాతకులు సుఖవంతులు, శ్రీమంతులు కార్యవిచక్షణగలవారు, భోగులు, దాతలు, గొప్ప అభిమానవంతులు, దీర్ఘాయువుగలవారు అగుదురు.

వి॥ నవమ దశమాధిపతు లొకరికొకరు కేంద్రగతులై యుండగ నొకరు గురునితో కలిసి, మరియొకరు లగ్నాధిపతితో కలసినను ఒకరు గురునితోను లగ్నాధిపతితోనుకలసి మరియొకరిని చూచినను "శ్రీమద్యోగ" మనబడును.

ఉదాహరణమునకు తులాలగ్నజాతకులకు భాగ్యాధిపతి చతుర్థములోనుండగ, రాజ్యాధిపతి గురునితోచేరి బుధునిచూచినను లగ్నాధిపతియగు శుక్రుడు బుధునితో చేరియుండగ గురునిచే

చూడబడినను యీ యోగము కలుగును. దీనిని మరికొన్ని విధములుగ వికల్పించవచ్చును ఏవిధముగ చూచినను 9, 10 స్థానాధిపతులకు కేంద్రస్థితి, గురుదృష్టి లగ్నాధిపతి సంబంధ ముండవలయును.

## 77 సులాభయోగము – ఫలము

శ్లో॥ చంద్రలగ్నాద్ధనే తారాగ్రహాః కోపిబలీయది।
సులాభనామకో యోగో ధీధనఖ్యాతిదాయకః॥ 142

తా॥ చంద్రునకు 2వ యింటిలో కుజ, బుధ, గురు, శుక్ర, శనులలో నెవరైన నొకరున్నచో "సులాభయోగ" మనబడును. ఈ యోగజాతకులు బుద్ధిబలము, ధనము, ఖ్యాతిగలవారగుదురు.

వి॥ ఇది సునఫాయోగ మనబడును. దీనినే గ్రంథకర్త సులాభ యోగమనెను.

## 78 అధిలాభయోగము - ఫలము

శ్లో॥ చంద్రలగ్నాద్వ్యయే కశ్చిద్బలీ తారాగ్రహోయది।
యోగోఽయమధి లాభశ్చ సుఖప్రభురనామయః॥ 143

తా॥ చంద్రునకు 12వ రాశియందు కుజ, బుధ, గురు, శుక్ర, శనులలో నెవరైన నొకరున్నచో "అధిలాభయోగ" మనబడును. ఈ యోగజాతకులు సుఖవంతులు, ప్రభువులు, రోగములులేని వారు అగుదురు.

వి॥ ఇది అనఫాయోగము. దీనినే గ్రంథకర్త "అధిలాభ" యోగ మనెను.

## 79 దురంధరయోగము – ఫలము

శ్లో॥ అనస్తగేషు బలిషు చంద్రాదుభయపార్శ్వయోః।
తారాగ్రహేషు సత్స్వేకో యోగోనామ దురంధరః॥ 144
సుతవాహన సంయుక్తస్స్యాత్స్వార్జితవిత్తవాన్।
దురంధరాహ్వయే యోగేజాతః కార్యధురంధరః॥ 145

శ్లో॥ చంద్రునకు 2, 12 రాశులందు అస్తమించని బలమైన తారా గ్రహములు (కు, బు, గు, శు, శనులు) న్నచో "దురంధర" యోగ మనబడును. ఈ యోగమందు పుట్టినవారు సుత, వాహన, సంపదలు గలవారు, త్యాగశీలురు, స్వార్జితధనము గలవారు, కార్యదక్షులు అగుదురు.

వి॥ దురంధర యోగముగ చెప్పబడిన యీ యోగము గ్రంథాంతరములందు "దురిధురా" యోగమనునామముతో చెప్పబడినది సామాన్యముగ యీ యోగము చాల జాతకములమీద కన బడదు. కొన్ని జాతకములందు "సునఫా యోగము" కొన్ని జాతకములందు "అనఫా యోగము" గోచరించుచుండును. దురధురా యోగము పట్టినప్పుడు 1 చంద్రుడు బలవంతుడై యుండవలెను 2 చంద్రునకు 2, 12 రాశులందు గ్రహములు బలవంతులై అస్తంగతదోషములేనివారుగనుండవలెను. చంద్రునకు 2వ రాశిలోనున్న గ్రహముగాని, 12వ రాశిలోనున్న గ్రహముగాని చంద్రునకు 30 భాగలదూరమును దాటియుండవలయును. చంద్రుని బలము ముఖ్యముగ గ్రహించవలయును.

1. మేషమందు చంద్రునకు 2, 12 రాశులందు అస్తమించని కుజాది పంచగ్రహములలో వృషభమందు శుక్రుడు, మీనమందు గురుడు స్థితినొందినచో యీ యోగము బలమైనదిగ నుండును. చంద్రునకు మిత్రక్షేత్రస్థితి, శుక్ర గురువులకు స్వక్షేత్రస్థితి కలిగియుండగ అస్సంగతదోషము లేనప్పుడీయోగ ముత్తమస్థితి గలవానిని చేయును.

2. వృషభమందు చంద్రునకు 2, 12 రాశులందు కుజాది పంచ గ్రహములలో 12లో కుజుడు, 2లో బుధుడున్నచో యీ యోగముత్తమ ఫలమునిచ్చును. కుజ బుధుల స్వక్షేత్రస్థితి, చంద్రునకుచ్చస్థితి మంచిది రవి కర్కటకములో నుండవలయును.

3. మిథునమందు చంద్రుడు, 2వ యింటిలో గురుడు 12లో శుక్రుడున్నప్పుడు యీ యోగము బాగుగా ఫలించును శుక్ర గురువుల కస్తమయ దోషముండరాదు.

4. కర్కాటకమందు చంద్రుడు మిథునమందు బుధుడు వృషభ రవి, సింహమందు కుజుడుగల జాతకులకీ యోగము బాగుగా ఫలించెను. (సింహమందు గురు శుక్ర శనుల స్థితి శ్రేష్టము కాదు. గురునకు సింహరాశి మిత్రక్షేత్రమైనను బలముకాదు. శుక్ర శనులకు సంహరాశి శత్రుక్షేత్ర మగుటచే బలము తగ్గి పోవును.

5. సింహమందు చంద్రుడుండగ కర్కాటకమందు గురుడు, కన్య యందు బుధుడు, తులయందు సూర్యుడున్నప్పుడు చంద్ర రాశ్యధిపతియగు రవికి నీచపట్టుటచేత చంద్రునకు బలము తగ్గి నది. ఈ యోగము కొంత తక్కువ ఫలముల నిచ్చును

6. కన్యయందు చంద్రుడున్నప్పుడు 2వ యింటిలో శుక్రుడు 12వ యింటిలో కుజుడు యీ యోగమందు బలవంతులగుదురు. కర్కాటకమందు సూర్యుడుండగ సింహమందు బుధుడున్న ప్పుడు శుక్రుడు రవికి 4వ స్థానములోనుండుట సాధారణముగ సాధ్యము కాదు.

7. తులయందు చంద్రుడుండగ వృశ్చికమందు కుజుడు స్వక్షేత్ర మందు, బుధుడు కన్యలో స్వక్షేత్రోచ్ఛలలో నున్నప్పుడీ యోగము బలము కలదగును. బుధునితో శుక్రుడు కలసినను దోషము లేదు. కుజునితో గురువు కలసినను మంచిదేయగును. మిగిలిన గ్రహముల స్థితులు సామాన్యముగ నుండగలవు.

8. వృశ్చికమందు చంద్రుడున్నప్పుడు చంద్ర రాశ్యధిపతి కుజుడు మకరములో నుండగ, చంద్రునకు 12లో శుక్రుడు, 2లో గురుడు స్థితినొందినచో యోగము ఫలించును. చంద్ర

రాశి నాథుని బలమునుబట్టి యీ యోగమునకు బలము కలుగును.

9. ధనుస్సులో చంద్రుడుండగ 2లో కుజుడు 12లో గురుడువున్న ప్పుడు బలము గలుగును. చంద్రరాశ్యధిపతి గురుడు మిత్రి క్షేత్ర మందుండుటవలన మంచిది. (2వ యింటిలో శని స్వ క్షేత్రము, 12లో కుజుడు స్వక్షేత్రములోనున్న జాతకులు కుటుంబ క్లేశములను, ధనహీనతను దుఃఖమును పొందు చున్నారు)

10. మకరమందు చంద్రుడుండగ కుంభమందు శుక్రుడు. ధనుస్సు లో గురుడు ఈ స్థితిలో శుక్రునకు మిత్రిక్షేత్రము, గురునకు స్వక్షేత్రము బలము ఈ యోగమందు పుట్టినవారు భోగముల ననుభవించువారు, కుటుంబవృద్ధి గలవారు అగుదురు. 2వ యింటిలో గురుడు 12వ యింటిలో శుక్రుడుండుట విశేష శుభ ఫలములుండవు. శుక్రుని శత్రుక్షేత్ర స్థితివలన శుక్రినకు బలము తగ్గును.

పూర్తి పాపులగు కుజ శనుల స్థితిలో కుంభమందు శని, ధను స్సులో కుజుడు మంచిది. కుంభ కుజుడు, ధనుశ్శనివలన ఫలము చాల స్వల్పముగ నుండును.

11. కుంభములో చంద్రిడుండగ మీనమందు గురుడు, మకర మందు శుక్రిడు శ్రేష్ఠము. విశేష శుభముల నిచ్చును. మీన శుక్రుడు, మకరగురుడు తక్కువ ఫలమునిచ్చును. మకరములో 12వ భావమందు గురుని నీచస్థితి వలన యోగ ప్రాబల్య ముండదు.

12. మీనమందు చంద్రుడుండగ మేషమందు గురువు, కుంభ మందు శుక్రుడు శుభము నెక్కువ యిచ్చును. 2వ యింటిలో శుక్రుడు 12లో గురువు తక్కువ శుభఫలముల నిచ్చును.

పాపాధియోగమందు మీనచంద్రునకు 2వ యింట కుజుడు,

12వ యింట శని స్వక్షేత్రబలము కలుగుటచేత యీయోగము క్రూరమైన ఫలముల నిచ్చును. ఇటువంటి యోగజాతకులు అవినీతిపరులు, దుష్టప్రవర్తి కలవారై యున్నారు. ఆర్థికముగ బలవంతులైనను సమాజమందు గౌరవమర్యాదలు తక్కువ కలవారు అగుచున్నారు.

ఈ దురధురాయోగమందు రెండు లేక మూడు గ్రహములు రెండవ ఇంటిలోను, అట్లే రెండు లేక మూడు గ్రహములు పన్నెండవ యింటిలోను వున్నప్పుడు ఆయాగ్రహములయొక్క స్థితి ననుసరించి ఫలము నూహించవలయును.

చంద్రునకు ధనస్థానమనగా కుటుంబము, ధనము, సంచిత ద్రవ్యము కుటుంబ పోషణము మొదలగు ధనభావఫలములను, పన్నెండవ యింటివలన ధనవ్యయము, వ్యయముచేయు మార్గములను ఇతర ద్వాదశభావ సంబంధమైన ఫలములను శుభాశుభగ్రహస్థితుల ననుసరించి వివరించవలసి యుండును.

ఉదాహరణమునకు చంద్రునకు 2వ భావములో (అనగా చంద్రస్థితభాగలనుండి 30 భాగలు దాటినపిమ్మట) గురు శుక్రులు, పన్నెండవ భావములో అనగా చంద్రస్థితభాగలకు 30 భాగల వెనుకలో కుజ శనులు వున్న జాతకులకు ద్వితీయ సంబంధమైన ఫలములు శుభముగను, వ్యయసంబంధమైన ఫలములను దుష్టఫలములుగను వివరించవలసియుండును. మిశ్రమ స్థితి కలిగినచో మిశ్రమ ఫలములను చెప్పవలయును,

దురధురాయోగ ఫలములనుగురించి చెప్పుటలో రాజయోగ కారక గ్రహదశలు వచ్చినప్పుడు విశేషఫలములను చెప్ప వలయును. సాధారణ దశలందు సామాన్య ఫలములను చెప్ప వలయును.

## 80 అధ్యక్షయోగము - ఫలము

శ్లో॥ లగ్నాదరిమదమృత్యుషు బలినస్సర్వే శుభాస్సితాఃఖేటాః।
అధ్యక్షనామయోగః ప్రాభవ, ధనకీర్తిదస్సతతమ్॥ 146

తా॥ లగ్నమునుండి 6, 7, 8 స్థానములందు సర్వశుభగ్రహములు స్థితి నొందినప్పుడు అధ్యక్షయోగ మగుచును.
ఈ యోగమందు బుట్టినవారు ప్రాభవము, ధనము, కీర్తికల వారగుదురు.

వి॥ ఈ యోగము పరాశరాహోరాది గ్రంథములలో "అధి యోగ"మని చెప్పబడినది. లగ్నమునకంటె చంద్రునినుండి యీ యోగమునకు ప్రాశస్త్యము చెప్పబడినది.
గ్రంథకర్త చంద్రాధియోగమునకు బదులు లగ్నాధియోగ మును చెప్పినాడు. "లగ్నాద్వా చంద్ర లగ్నాద్వా" అను వచనానుసారము లగ్నమునుండికూడ నీ యోగము చెప్ప బడినది.
"పరాశరహోర" చాంద్రయోగాధ్యాయము 6వ శ్లోకములో నిట్లు గలదు.
చంద్రాద్రంధ్రారికామస్థైఃసౌమ్యైః స్యాదధియోగకః॥
తత్రరాజాచ మంత్రీచ సేనానిశ్చబలక్రమాత్॥
చంద్రునినుండి 6,7,8 మూడు స్థానాల్లోను బుధ గురు శుక్రులు ముగ్గురు వున్నప్పుడు రాజు అని, రెండు స్థానాల్లో రెండుగాని మూడుగాని గ్రహములున్నప్పుడు మంత్రియని, 1 స్థానమందు ఒకరు లేక ఇద్దరు లేక ముగ్గురు యున్నప్పుడు సేనానాయకుడని బలము ననుసరించి చెప్పవలయునని యన్నది. బలము నను సరించి యనుటచేత గ్రహములయొక్క బలము, మరియు రాశుల లోగల గ్రహముల స్థానబలమును బట్టి నిర్ణయించవలసి యుండును.

ఫలదీపికాకారుడు "ఫలదీపిక" 6వ అధ్యాయములో 42, 48 శ్లోకములలో నిట్లు చెప్పియుండెను.

సౌమ్యైరిందోర్ధ్యూనమత్రంధ్రసంస్థైస్తద్వల్లగ్నాత్ సంస్థితైరాధియోగః। నేతా మంత్రీభూపతి స్స్యాత్క్రమేణఖ్యాతః శ్రీమాన్దీర్ఘజీవీమనస్వీ॥

చంద్రునినుండిగాని, లగ్నమునుండిగాని 6, 7, 8 స్థానములందు శుభ గ్రహములున్నచో 1 రాశియందు ఒక శుభగ్రహమున్నచో సైన్యాధిపతి, 2 రాశులందు రెండుగ్రహములున్నచో మంత్రి, మూడు రాశులందు మూడు గ్రహములున్నచో రాజు (ప్రభువు) అగుననియు, మరియు ఖ్యాతికలవాడు, శ్రీమంతుడు, దీర్ఘాయువుకలవాడు, మనస్వియగునని చెప్పినాడు. వీనిలో వికల్పములు వివిధముగ వచ్చును

6, 7, 8 రాశులందు ఒక్కొక్కరాశి యందొక్కొక్కగ్రహము 6,7 రాశులందు 3 గ్రహములు 1 రాశియందు మూడుగ్రహములుండుట సంభవించ వచ్చును. బుధుడు రవికి దూరముగ నుండవలయును

బుధుడు లగ్నమునుండిగాని, చంద్రునినుండిగాని 6వయింటిలో నున్నప్పుడు రవి 5వ యింటిలోనుండుట సంభవించును. బుధుడు 7లో నున్నప్పుడు రవి 6,7,8 రాశులలో ఎందైననుండుట సంభవించును ఇట్టి సమయములందు యీ యోగప్రాబల్యము తగ్గును.

1. 6లో బుధుడు 7లో గురుడుగాని శుక్రుడుగాని యుండగ రవి 5వ యింటిలో నుండవలెను.

2. 6లో గురుడు 7లో శుక్రుడు 8లో బుధుడున్నప్పుడు రవి 9లో నుండవలెను.

3. బుధుడు 7లో నున్నప్పుడు రవి 6 లేక 8లో నుండుట సంభవించుటచేత 6,8 రాశులలో గురు శుక్రు లెవరున్నను, యీ యోగమునకు ప్రాబల్యము తగ్గును.

ఉత్తమాధియోగమును గురించి విమర్శించినప్పుడు

1. 5వ యింటిలో రవి 6లో బుధుడు 7లో శుక్రుడు 8లో గురుడు
2. 5వ యింటిలో రవి 6లో బుధశుక్రులు 7లో గురువు.
3. 5వ యింటిలో రవి 6లో బుధ గురు శుక్రులుండుట సంభవించినప్పుడు ఉత్తమాధి యోగముగ గ్రహించవలయును.
4. ఒక రాశియందున్నను మూడు గ్రహములయొక్క స్థితి ముఖ్యమని గ్రహించవలయును.
5. చరలగ్నమునకుగాని, చరరాశిగత చంద్రలగ్నమునకుగాని పట్టిన అధియోగముకంటె స్థిర రాశికి పట్టిన అధియోగము బలము దీనికంటె ద్విస్వభావరాశికి పట్టిన అధియోగము ప్రబలము అని తెలుసుకొనవలయును.

బలక్రమము ననుసరించి యీ యోగము ఫలించుననుటచేత మేషలగ్నమునుండి గాని మేషమందున్న చంద్రునినుండి గాని 6వ రాశిలో బుధుడు 7లో శుక్రుడు 8లో గురుడున్నప్పుడుగల అధియోగముకంటె, వృషభ లగ్నమునకుగాని, వృషభమందున్న చంద్రునకుగాని 6వ రాశిలో బుధుడు 7వ రాశిలో శుక్రుడు 8వ రాశిలో గురుడున్నప్పుడుగల అధియోగము. బలము. దీనికంటె ద్విస్వభావ రాశియగు మిథునమునకుగాని మిథునమందున్న చంద్రునకుగాని 6వ యింటిలో బుధుడు 7వ యింటిలో శుక్రుడు 8వ యింటిలో గురుడున్నప్పుడుగల అధియోగము బలమైనది అని చెప్పవచ్చునుకాని ఇచ్చట బుధుడు శుక్రుడు శత్రుక్షేత్రములందు గురుడు నీచరాశియందు స్థితి

నొందుటచేత గాని బలమున్నను గ్రహములకు తగిన స్థాన బలములేనందున యీయోగము విశేషఫలప్రదము కాజాలదు ఇట్లే రాశులయొక్క గ్రహములయొక్క బల తారతమ్యమును బట్టి యోగప్రాబల్య దౌర్బల్యములను నిర్ణయించవలసి యుండును.

ధనుర్లగ్నమునకు గాని, ధనుస్సునందున్న చంద్రునకుగాని 6,7,8 రాశులలో వరుసగ శుక్ర, గురు, బుధులున్నప్పుడు రాశిబలము గ్రహములకు బలము కలుగును. ఈ యోగము ఉత్తమ ఫలముల నిచ్చును. ఇట్లే ఇతర లగ్నములకు ఊహించ వలెను.

## 81 ఇష్టపాలయోగము - ఫలము.

శ్లో॥ సర్వే గ్రహాయస్య న జన్మరాశే
ఆపోక్లిమాదన్యగృహేషు తస్య।
రాజ్యప్రదసౌఖ్య కరశ్చ పుణ్యో
యోగస్సదాయం కలితేష్టపాలః॥ 147

తా॥ రవ్యాది సమస్త గ్రహములు ఆపోక్లిమరాశులందుగాక ఇతర స్థానములందున్నచో "ఇష్టపాల" యోగమనబడును ఈ యోగ జాతకులు రాజ్యములను పాలించువారు, సౌఖ్యము నొందువారు, పుణ్యకర్మల నాచరించువారు అగుదురు.

వి॥ కేంద్రపణపరములందు మాత్రమే రవ్యాది గ్రహములుండ వలెనని భావము.

## 82 రాజయోగము - ఫలము

శ్లో॥ తుంగస్థితై స్త్రిత్ర్యధికైః ఖేచరై ర్భూపతిర్భవేత్।
చతుర్భిః పంచభిర్వాపి నీచస్థైర్వా మహీపతిః॥

రాజన్వతీ వసుమతీ శుభతుంగయోగే
రాజాభవేదధచ తుంగగతైశ్చపాపైః॥ 148
స్యాద్రాజవాంశ్చవిషయః ప్రభుణేరిభేదో।
దీర్ఘాయురర్థ సుఖవాహన రాజ్యదాయీ।
నీచస్థితైర్వా ఖచరైశ్చరాజా
భవేత్పృథివ్యాం బహుకంటకశ్చ।
జాతశ్చిరంజీవతి విత్తవాంశ్చ
భంగం సమాప్నోతి తథాంతకాలే॥ 149

తా॥ ఏ జాతకునకైనను 3 లేక 4 లేక 5 గ్రహము లుచ్చరాశు లందున్నచో రాజగును. నీచ యందున్నను రాజగును. మూడు శుభగ్రహములుచ్చలో నున్నచో (చంద్ర, గురు, శుక్రులు) రాజగును. ఇట్టి యోగమందు పుట్టినరాజు సాత్త్విక ప్రభువగును. దీర్ఘాయువు, ధనము, సుఖము, భోగములు గల వాడగును.

పాపులు (రవి కుజ శనులు) ఉచ్చగతులైనప్పుడుకూడా రాజ గును. ప్రభువుగ చెప్పుకొనుటకు మాత్రమే వీలగును.

మూడు నీచగ్రహములుండుట వలనకూడ ప్రభువగును. కాని ప్రజలకు బహు కష్టములను కలిగించును. దీర్ఘాయుష్మంతుడు, ధనవంతుడు అగును. అవసాన కాలములో దుఃఖములను పొందును.

## 83 రాజపదయోగము - ఫలము

శ్లో॥ చంద్రలగ్నేశ్వరా యస్యవర్గోత్తమగతౌశుభౌ।
చతుర్భిః ఖేచరైర్దృష్టో యోగో రాజపదాహ్వయః॥ 150
యోగేరాజపదేజాతో రాజావారాజసన్నిభః।
మంత్రీప్రధానః ప్రబలో గ్రామణీర్వా భవిష్యతి॥ 151

తా॥ చంద్రుడు, లగ్నాధిపతి యిద్దరు శుభులై వర్గోత్తమమునుపొంది 4 గ్రహములచే చూడబడినచో "రాజపద" యోగమనబడును ఈ యోగమందు పుట్టినవారు మంత్రులు, ప్రధానులు. గ్రామాధిపతులు బలవంతులు అగుదురు.

వి॥ చంద్రుడు సంపూర్ణుడై యుండవలెను. లగ్నాధిపతికూడా నైసర్గిక శుభుడై యుండవలెను.

## 84 అమోఘయోగము – ఫలము

శ్లో॥ ఉచ్చమూలత్రికోణస్థైర్బహుభిశ్శుభఖేచరైః।
అమోఘనామాయోగోఽయం రాజ్యమూలమహాధనః॥ 152

తా॥ బహుశుభగ్రహములు తమతమ ఉచ్చ, మూలత్రికోణస్థానము లందున్నచో "అమోఘ"మను యోగము పట్టును. ఈ యోగ జాతకులు రాజ్యమూలక బహుధనము కలవారగుదురు.

వి॥ బహు శుభగ్రహములనుటచే మూడు శుభ గ్రహములను గ్రహించవలెను. ఒకప్పుడు నాలుగు గ్రహములను గ్రహించ వచ్చును.

చంద్ర గురు బుధుల కుచ్చస్థితి, శుక్రునకు తులయందు మూల త్రికోణస్థితి సంభవించును.

కన్యలో బుధుడు, తులలో శుక్రుడు వున్నప్పుడు గురుచంద్రుల ఉచ్చస్థితి లేక మూలత్రికోణస్థితి యుండుటవలన కూడ యీ యోగము ఫలించును.

## 5 శృంగాటయోగము – ఫలము

శ్లో॥ లగ్న పంచమభాగ్యేషు సగ్రహేషుశుభేషుచ।
యోగశ్శృంగాటకో నామసుఖదశ్చోత్తరాయుషి॥ 153

తా॥ లగ్న పంచమభాగ్య భావములందు శుభగ్రహములున్నచో "శృంగాటక" యోగ మనబడును. ఈ యోగజాతకులు జీవితముయొక్క రెండవ భాగమందు సుఖము ననుభవించెదరు.

## 86 త్రిలోచనయోగము - ఫలము

శ్లో॥ సూర్యాంగారక చంద్రాణాం మిథఃకోణస్థితిర్యది।
బలినాంపంక్తి వృత్తిత్వం యదవాస్యాత్త్రిలోచనః॥ 154
యోగేత్రిలోచనేజాతో మహదైశ్వర్యసంయుతః।
హాతా మిత్రశ్చ మేధావీ భవితాచిరజీవనః॥ 155

తా॥ సర్వగ్రహములు వరుసగనుండగ రవి, చంద్ర, కుజులుమాత్రము లగ్నముకుండి కోణరాశులలో నున్నచో "త్రిలోచన" యోగమనబడును.

ఈయోగజాతకులు విశేషైశ్వర్యము గలవారు. శత్రువులు లేనివారు. మేధావులు, దీర్ఘాయువు గలవారు అగుదురు.

వి॥ రవి చంద్ర కుజులు ముగ్గురు లగ్న, పంచమభాగ్యములందు కలసిగాని విడిగగాని ఒకకోణ రాశియందుగాని రెండు రాశులందుగాని యుండగ, మిగిలిన గ్రహములు వరుసగనున్నచో యీ యోగమును చెప్పవలెను.

ఉదాహరణమునకు పంచమ కోణమందు కుజ రవులు భాగ్య కోణమందు చంద్రుడుండగ 4లో బుధుడు 6లో శుక్రుడు 7లో గురుడు 8లో శనియున్నచో గ్రహములన్నియు వరుసగ నుండును. మరికొన్ని విధములుగ కూడ దీనిని సాధించవచ్చును.

మరియొక విధము :- 8లో శని 9లో రవి 10లో బుధుడు 11లో శుక్రుడు 12లో గురుడు లగ్నమందు చంద్రుడు కుజుడు వున్నప్పుడు పై యోగము పట్టును లగ్నము కేంద్రము కోణముకూడ యగుచున్నందున లగ్నమునుకూడ గ్రహించవచ్చును రవి చంద్ర కుజలు మాత్రము కోణరాశులందుండుట మిగిలిన నాలుగు గ్రహములు వరుసగనుండుటముఖ్యము. (రాహు కేతువులస్థితి ముఖ్యముకాదు)

## 87 క్షేమయోగము - ఫలము

శ్లో॥ లగ్నాయుర్భాగ్యకర్మేశాః స్వక్షేత్రేషుస్థితాయది।
క్షేమోనామమహాయోగః కుటుంబక్షేమదాయకః॥ 156

తా॥ లగ్న, అష్టమ, భాగ్య, దశమాధిపతులు నలుగురు వారి వారి స్వక్షేత్రములందున్నచో "క్షేమయోగ" మనబడును. ఈ యోగజాతకులకు కుటుంబము సర్వదా క్షేమముగ నుండును.

వి॥ ఈ యోగమును గురించి విచారించినప్పుడు కొన్ని లగ్నములకు మూడు భావాధిపతులనే గ్రహించవలసియుండును. కొన్ని లగ్నములకు నాలుగు భావాధిపతులను గ్రహించుటకు వీలగును.

మేష తులా లగ్నములకు లగ్నాష్టమాధిపతి, వృషభలగ్నమునకు భాగ్యరాజ్యాధిపతి, మిథునలగ్నమునకు అష్టమభాగ్యాధిపతి, కన్యాలగ్నమునకు లగ్నదశమాధిపతి, మీనలగ్నమునకు లగ్న రాజ్యాధిపతి ఒక్కడే యగుటచేత యీ లగ్నజులకు మూడు భావాధిపతులకు మాత్రమే స్వక్షేత్రస్థితి కలుగును

4వ భావమునకు సంకోచము కలుగును. మిగిలిన లగ్నములకు లగ్నాష్టమ భాగ్యరాజ్యాధిపతుల స్వక్షేత్రస్థితి సంభవించును. మూడు స్థానాలలో మూడు గ్రహములు స్వక్షేత్రములలో నున్నప్పుడు ఒక భావానికి కొంత దోషము సంక్రమించే అవకాశములుండును.

ఉదాహరణకు మేష లగ్నమునకు లగ్నాష్టమాధిపతి కుజుడు, భాగ్యరాజ్య భావములకు గురు శను లధిపతులు. గురుడు భాగ్యమందు శని రాజ్యమందుండగ కుజుడు లగ్నమందుగాని అష్టమమందుగాని యుండవలసి యుండును. లగ్నమందష్టమాధి యున్నను, లగ్నాధిపతి అష్టమమందున్నను స్థితి దోషమువలన కొంత చెడు ఫలము సంక్రమించగలదు. ఇట్లే యితరములూహ్యములు.

## 88 యూపయోగము - ఫలము

శ్లో॥ లగ్నే ద్వితీయే సహజే చతుర్థే
యథాయథం సర్వఖగాశ్రితేషు।
యూపాఖ్యయోగః కిల తత్రజాత
స్త్యాగాత్మవాన్ కీర్తియుతశ్చయాజీ॥ 157

తా॥ లగ్న ద్వితీయ తృతీయ చతుర్థ భావములందన్నిగ్రహము లున్నచో యూపయోగమనబడును. ఈ జాతకులు త్యాగబుద్ధిగలవారు, కీర్తివంతులు యజ్ఞాదిక్రతువులు చేయువారు అగుదురు.

వి॥ ఈ యోగము నాభసయోగములలో గలదు.

## 89 ఛత్రయోగము - ఫలము

శ్లో॥ ఆరభ్యస ప్తమం లగ్న పర్యంతం స ప్తరాశిషు।
స ప్తగ్రహాః క్రమేణస్స్యు ర్యోగో౽యంఛత్రసఃజ్ఞకః॥ 158
ఛత్రయోగభవోమర్త్యోచత్రచామరయోగవాన్।
స్వజనేష్టకరోంత్యేతు వయస్యధిక సౌఖ్యవాన్॥ 159

తా॥ స ప్తమ భావమునుండి లగ్నమువరకు 7 రాశులందు ఏడుగ్రహములు వుండుటచేత ఛత్రయోగ మేర్పడును. ఈ యోగజాతకులు స్వజనులకు క్షేమమును చేకూర్చును. అంత్యవయస్సునందు విశేష సుఖము నొందును.

వి॥ ఈ యోగము నాభసయోగములలో గలదు. దీని ఫలమును గూర్చి జాతక పారిజాతము 7వ అ॥లో॥ "ఛత్రేచాద్యంతసౌఖ్యాతుల ధనబలవాన్" అని చెప్పబడుటచేత యీ యోగజాతకులు ఆద్యంతవయస్సులలో నెక్కువ సుఖమును పొందగలరని ఫలభేదము చెప్పబడినది.

## 90 సముద్రయోగము - ఫలము

శ్లో॥ ధనసుఖరిపుమృత్యుకర్మరిః ఫే
ష్వఖిలఖగాస్సక లేషు స ప్తమట్సు।
సరిదధిపతి సఁజ్ఞతశ్చయోగో
నరపతి భోగకరస్తు జాతకస్య॥ 160

తా॥ ద్వితీయ-చతుర్థ, షష్ఠ, అష్టమ- దశమ- ద్వాదశ భావములందారు భావములందు స ప్తగ్రహములుండుటచేత "సముద్ర

యోగ" మనబడును. ఈ యోగజాతకులు రాజభోగముల ననుభవించెదరు.

వి। ఒక భావమును విడచి తరువాత భావములో గ్రహములుండవలయును.

## 91 చక్రయోగము - ఫలము

శ్లో॥ తను సహజపుత్రమన్మథగురులాభేషుస్థితా గ్రహాస్సర్వే।
సర్వేషు చక్రయోగో నరపతి చూడామణిర్భవతి॥ 161

తా। లగ్న, తృతీయ, పంచమ, సప్తమ, భాగ్య, లాభభావములందు సర్వగ్రహము లుండుటచేత "చక్రయోగ" మగును. ఈ యోగజాతకులు రాజులలో శ్రేష్ఠులగుదురు.

వి॥ ఈ యోగము విషమభావములందు గ్రహములుండుటచేత సంభవించును. దీనియందు విశేషఫలము చెప్పబడినది సముద్రయోగము సమభావములందు గ్రహము లుండుటవలన ఏర్పడినది. దీనియందు ఫలము తక్కువయని గ్రహించవలయును.

## 92 కేదారయోగము - ఫలము.

శ్లో। యస్య రాశిచతుష్కేతు ఖేటా స్సర్వేయథాయథం।
కేదారయోగస్సభవేత్కృషివిత్త సుఖోదయః॥ 162

తా। ఏ జాతకులకైనను సర్వగ్రహములు నాలుగు రాశులందున్నచో "కేదార" యోగమనబడును. ఈ యోగజాతకులు వ్యవసాయము వలన ధనమును, సుఖమును పొందగలరు.

వి॥ బృహజ్జాతక "నాభసయోగధ్యాయము"లో దీని ఫలమును

గురించి "కేదారజః కృషికరః సుఖహూపవహోఢ్యః" అని కృషి కర్తయేగాక అనేక జనుల కుపకారములను చేయువాడని విశేషము చెప్పబడినది.

## 93 కేసరియోగము - ఫలము

శ్లో॥ బృహస్పతిశ్చంద్రకేంద్రే యస్యజన్మనివిద్యతే।
యోగః కేసరి నామాయం జాతకస్య సుఖప్రదః॥ 163

తా॥ చంద్రునకు కేంద్రమందు గురుడున్నచో "కేసరి" యోగ మగును. ఈజాతకులు సుఖము ననుభవించెదరు.

వి॥ ఈ యోగమందు చంద్ర గురువులకు బలముండవలెను. మేము చూచిన కొన్ని జాతకములలో క్షీణచంద్రుడు కర్కాటకము లోను గురుడు మకరమందు నీచలోనున్నప్పుడు వీరి జీవితము దుఃఖపూరితముగ నుండెను.

వృశ్చికలగ్నమై అందు చంద్రుడుండగ దశమ కేంద్రమందు గురుడుండి రవి కర్కాటకములోనున్న జాతకులు భిక్షాటనము నుచేయుచుజీవించెను వీరిజీవితమంతయు భిక్షాటనముతోగడచెను

గురుడస్తమించెను. చంద్రునకు (భాగ్యాధిపతి) నీచస్థితి. ధన పంచమాధిపతియగు గురునకు రాజ్యకేంద్ర స్థితిలో అస్తమయ దోషము పట్టుటచేత వీరికి ధనము సుఖము లభించలేదు.

## 94 ఆయుర్యోగము - ఫలము

శ్లో॥ లగ్నేశజీవశుక్రాస్తు యస్యజన్మని కేంద్రగాః।
ఆయు ర్యోగస్తు జాతస్యకురుతే చిరజీవనమ్॥ 164

తా। లగ్నాధిపతి, గురుడు, శుక్రుడు కేంద్రములందున్నచో "ఆయు ర్యోగ" మనబడును. ఇట్టి జాతకులు పూర్ణాయువుగలవారై చిరకాలము జీవించెదరు.

## 95 ఉత్తమయోగము - ఫలము

శ్లో। అర్కాదాపోక్లిమే చంద్రే బలిన్యుత్తమ యోగవాన్।
వినీతో విత్తవాన్ జ్ఞానీ కార్యేషునిపుణో భవేత్ ॥ 165

తా। సూర్యునినుండి బలవంతుడైన చంద్రుడు ఆపోక్లిమ రాశులలో నున్నచో "ఉత్తమయోగ" మనబడును. ఈ యోగజాతకులు నీతిమంతులు, ధనవంతులు, జ్ఞానవంతులు, కార్యదక్షులు అగుదురు.

వి॥ రవినుండి 3,6,9,12 రాశులలో 6, 9 రాశులందు చంద్రుడుండుటచే మంచి ఫలితములు కలుగును. "బలిని" అని చంద్రుడు బలవంతుడుగ నుండవలెనని చెప్పటచేత రవినుండి 6 లేక 9 రాశులలో నున్నప్పుడు చంద్రునకు బలము కలుగును.

## 96 ధనాకర్షణయోగము - ఫలము

శ్లో। ఆయే లగ్నేడాయపో భాగ్యగశ్చేత్
భాగ్యేట్కామే కామపః పంచమేచ।
పుత్రాధీశో విక్రమే విక్రమేశో
లగ్నే విత్తాకర్షణో నామ యోగః॥ 166
విత్తాకర్షణయోగేతు జాతకో యత్రమందిరే।
అర్థాప్తిరఖిలో పాయై ర్భవేత్తద్గృహవాసినామ్॥ 167

తా। లగ్నాధిపతి యేకాదశమందు, లాభాధిపతి భాగ్యమందు,

భాగ్యాధిపతి సప్తమమందు, సప్తమాధిపతి పంచమమందు, పంచమాధిపతి తృతీయమందు, తృతీయాధిపతి లగ్నమందు నే జాతకమందుండునో ఆ జాతకుడు "ధనార్జనయోగ" జాతకుడగును. ఇట్టి జాతకుడు ఏగృహమందు జన్మించునో యాగృహవాసులకు అనేకవిధములైన ఉపాయముల వలన ధనము లభించును.

వి॥ లగ్న, తృతీయ, పంచమ, సప్తమ, భాగ్య, లాభాధిపతులు తమ తమ భావములకు యేకాదశస్థానములో నుండుట యీ యోగమునకు హేతువగుచున్నది.

## 97 ఉపచయయోగము – ఫలము

శ్లో॥ త్రిషష్ఠకర్మలాభేషు యస్య సర్వే శుభగ్రహాః।
యోగస్తూపచయోనామ జాతస్యశుభదాయకః॥ 168
ఉపచయయోగేజాత శ్శుక్లశశీవాన్వహం వృద్ధిమ్।
సముపైతి సర్వమాన్య స్సుందరమూర్తి స్సుఖీధనిమానీ॥ 169

తా॥ తృతీయ, షష్ఠ, దశమ, లాభభావములందు సర్వశుభగ్రహములున్నచో 'ఉపచయ' యోగమని పేరు. ఈ యోగజాతకులు శుక్లపక్ష చంద్రునివలె క్రమముగ అభివృద్ధిని పొందుచు, అందరిచేత గౌరవింపబడువారు, సుందరమైన శరీరముగలవారు, సుఖము, ధనము, అభిమానము గలవారగుదురు.

## 98 కులవర్ధనయోగము - ఫలము

శ్లో॥ చంద్రార్క-లగ్నస్థానానాం పంచమేషు శుభగ్రహాః।
సర్వేషుబలినస్సర్వే యోగోఽయంకులవర్ధనః॥ 170

కులవర్ధనయోగేతు జాతస్స్యాత్ కులవర్ధనః।
పుత్ర పౌత్ర ప్రపౌత్రాయురారోగ్య ధనసౌఖ్యభాక్॥ 171

తా। లగ్న, రవి, చంద్రులనుండి పంచమ భావములందు శుభ గ్రహములున్నచో "కులవర్ధన" యోగమనబడును. ఈయోగమందు పుట్టినవారు పుత్ర, పౌత్ర, ప్రపౌత్రసుఖము, ఆయువు, ఆరోగ్యము, ధనము, సుఖము కలవారగుదురు.

వి। లగ్నమునుండి రవినుండి చంద్రునినుండి పంచమ స్థానములు పుత్రస్థానములు మరియు కోణరాశులు లక్ష్మీస్థానములు అగుటచేత యీ స్థానములందు శుభులగు బుధ, గురు, శుక్రులు ముగ్గురు యెచ్చటనున్నను యీయోగము కలుగును మూడు స్థానములనుండి పంచమములందు శుభులుండుట ముఖ్యము. ఈ యోగము తరుచుగ సంభవించుట కష్టము.

## 99 వాహనయోగము - ఫలము

శ్లో। చంద్రసూర్యవిలగ్నేషు బలవద్గృహతశ్శుభే।
పాపాయుక్తే చ సశుభే యోగో వాహన సంజ్ఞితః। 172
అగ్నేయమర్కే శకటంచసాశ్వం।
చంద్రేత్వథాప్యం సవృషంచవాహనమ్।
భౌమేయధార్కశ్చసితేయ ఘేందుః।
బుధేతు మిశ్రంచ గజాదికంగురా। 173

తా॥ లగ్న రవి చంద్రులలో నెవరు బలవంతులో వానినుండి 9వ భావము పాపగ్రహరహితమై శుభులతో కూడినచో "వాహన యోగము" కలుగును. వాహనములను నిర్ణయించుటలో రవి కుజుల వలన గుర్రపు శకటము యుండును. చంద్రుడుగాని

శుక్రుడుగాని యున్నచో వృషభముతోకూడిన వాహనము కలుగును. బుధుడున్నచో మిశ్రమ వాహనముండును. గురుడున్నచో గజాది వాహనములుండును.

వి॥ వాహనయోగ విచారణలో "ఆగ్నేయం" "ఆప్యం" అని రెండు పదములు గలవు. వీనియొక్క సమన్వయము సమముగ బోధపడుటలేదు.

## 100 జయయోగము – ఫలము

శ్లో॥ శత్రుస్థానపతౌ నీచే రాజ్యేశే తుంగసంశ్రితే।
తౌ బల్యబలినే యస్య లగ్నవీర్యే జయీ భవేత్॥

తా॥ శత్రుస్థానాధిపతి నీచలోనుండగ రాజ్యాధిపతి యుచ్చరాశిలో నుండి బలవంతులైనను కాకపోయినను లగ్నము బలముకలదైనచో "జయ" యోగ మనబడును. ఈ యోగ జాతకులు సర్వదా జయమును పొందువారగుదురు.

శ్లో॥ శ్రీ వేంకటేశకృపయా వెంకటేశ్వరశర్మణా।
సద్దిష్టేయం విజయతే యోగానాం శతమంజరీ॥

తా॥ శ్రీ వేంకటేశ్వర స్వామివారి అనుగ్రహముచే వేంకటేశ్వర శర్మయను దైవజ్ఞునిచే "శతయోగమంజరి" అను నామధేయముగల యీ యోగావళీ గ్రంథము చెప్పబడినది. ఈ గ్రంథము సర్వదా విరాజిల్లుగాక.

శతయోగమంజరియను గ్రంథమునకు
మధుర కృష్ణమూర్తి శాస్త్రిచే వ్రాయబడిన
ఆంధ్రానువాద వివరణము సమాప్తము.

## మధుర కృష్ణమూర్తిశాస్త్రిగారి
## ఇతర ప్రచురణములు

1. బృహత్పరాశరహోరాశాస్త్రము (జాతకగ్రంథము) రు. 60-00
(1వ భాగము)
2. బృహత్పరాశరహోరాశాస్త్రము ( ,, ) 2వ భాగము) 60-00
పరాశరమహర్షిచే చెప్పబడిన శతాధ్యాయపరిమితమైన ప్రత్యక్షఫలప్రదమైన జాతకగ్రంధరాజము. పై రెండు భాగములందు 85 అధ్యాయములకు ఆంధ్రానువాద వివరణ విశేషాంశములతో వ్రాయబడినఉత్తమగ్రంథము.
3. భావార్థరత్నాకరము (ఉత్తమ జాతకగ్రంధము)— 50-00
(మేషాది ద్వాదశలగ్నలగూర్చి, తన్వాది ద్వాదశభావములగూర్చి, యోగాయోగములగురించి జాతకోదాహరణములతో ఆంధ్రానువాదము చేయబడినది)—
4. వాస్తుశాస్త్రవివేకము (ఒకటవ భాగము) 20-00
5. వాస్తుశాస్త్రవివేకము (రెండవ భాగము) 30-00
6. వాస్తుశాస్త్రవివేకము (మూడవ భాగము) 25-00
7. వాస్తుశాస్త్రవివేకము (నాలుగవ భాగము) 35-00
(భారతీయ ప్రాచీనవాస్తుశాస్త్ర గ్రంధములను కూలంకషముగా చర్చించి, పరిశోధించి వ్రాయబడిన గృహవాస్తుశాస్త్ర గ్రంధరాజము. అనుభవముతోను విపులమైన విమర్శతోను, బహువిధ చిత్రములతోను అలరారుచున్న గ్రంధరాజమిదియొక్కటియే. ఈగ్రంథము నామూలాగ్రము చదివినవారికి గృహవాస్తుశాస్త్రము కరతలామలకమగుటలో సందేహము లేదు)
8. దైవజ్ఞవల్లభము (శ్రీపతిరచితము) ముద్రణలోనున్నది. ప్రశ్నశాస్త్రము.

ప్రాప్తిస్థానము :

**జ్యోతిష విజ్ఞాన కేంద్రము**

సీతంపేట — రాజమండ్రి-4.